ప్రథమ ముద్రణము
1000 ప్రతులు
జూన్ 1958

---

గీ॥ "తెలుఁగదేల యన్న - దేశంబు తెలుఁగేను
తెలుఁగు వల్లభుండ - దెలుఁగొకండ
యెల్ల నృపులు గొలువ - నెఱుగవే బాసాడి
దేశభాషలందుఁ - దెలుఁగు లెస్స"

---

శ్రీ విష్ణు ప్రింటర్స్,
హిందూపురం.

## గ్రంథమాలకు జీవిత సభ్యులై 116 రూప్యంబు లొసంగిన దాతలు.

1 శ్రీ కల్లూరు సుబ్బారావుగారు, యం. ఎల్. ఏ., హిందూపురము.
2 శ్రీ కంగనపల్లి శ్రీనివాసులుగారు, అడ్వకేటు, కేశవవిలాస్, అనంతపురం
3 శ్రీ పైడి లక్ష్మయ్యగారు, ఓ. ఎ ఓ. ఎల్., కమీషనరు,
H. R. C. E. బోర్డు, హైదరాబాదు
4 శ్రీ గోళ్ళపల్లి సీతారామయ్యగారు, శ్రోత్రియందారు పాపంపల్లి
అనంతపురము
5 శ్రీ కరణం రామచంద్రరావుగారు, శనిగలకూడూరు, తాడిపత్రి తా॥
6 కీ॥ శే॥ ఆత్మారామప్పగారి జ్ఞాపకార్థము,
శ్రీ పి. యల్. నారాయణరావు,గారు బి. ఏ., ఆత్మారాం అండుకో,
అనంతపురము
7 శ్రీ డి. బాలన్నగారు, సారస్వతాభిమానులు, హిందూపురము
8 శ్రీ టి. బయన్నగారు, మునిసిపల్ కౌన్సిలర్, అండ్ జనరల్ సెక్రెటరీ,
బాక్ వర్డు క్లాసస్, అనంతపురము
9 శ్రీ బి. వెంకటనారాయణప్పశ్రేష్ఠిగారు, వెన్నెరపల్లి, కల్యాణదుర్గము తా॥
10 శ్రీ సి. రామిరెడ్డిగారు ప్రొప్రయిటరు విశ్వనాథ ప్రెస్, కమలానగర్,
అనంతపురం.

(ఇందులో, కొందఱు, తమ చిత్రపటములు ముద్రింప నంగీకరింపలేదు మఱికొందఱు తమ ఫొటోస్ (Blocks) పంపలేదు. మఱియొక పుస్తకమున లోపములు సవరించుకొందుము.)

## ఉద్ధారకులు
## (రూ॥ 58_0_0)

1 శ్రీ మేడా సుబ్బయ్య శ్రేష్ఠిగారు, మునిసిపల్ ఛైర్మెన్ అనంతపురము.
2 శ్రీ ఎన్. శ్రీరామరెడ్డిగారు, బి, ఏ., క్షేత్రాధికారి, బెంగళూరు సిటీ
3 శ్రీ గొంగడిరామప్పశ్రేష్ఠిగారు, మేనేజరు, దుర్గాఆయిల్ మిల్స్, అనంతపురం

# రాజపోషకులు

## (రూ॥ 25_0_0)

1 శ్రీ వై. వి. అశ్వత్థనారాయణరావు గారు పోష్టుమాస్టరు H. P. O. అనంతపురం.

2 ,, కంచిరెడ్డిగారి లింగారెడ్డిగారు పామిడి కొత్తపల్లి. పామిడి పోష్టు (అనంతపురం తా॥)

3 ,, గుంటి సుబ్రహ్మణ్యశర్మ గారు, అనంతపురం.

4 ,, కోడ్దము హనుమంతరావు గారు ప్లీడరు, అనంతపురం

5 ,, కరణము కృష్ణమూర్తిరావుగారు, భూస్వామి, గంగవరం,కల్యాణదుర్గము

6 ,, కరణము, విరూపాక్షప్పగారు భూస్వామి కల్యాణదుర్గము.

7 శ్రీ కట్టా లక్ష్మీనారాయణయ్యగారు, మునిసిపల్ కౌన్సిలరు, హిందూపురం.

8 శ్రీ కట్టా వెంకటశేషయ్య శ్రేష్ఠిగారు, హిందూపురం

9 శ్రీ కె. అనంతయ్య శ్రేష్ఠిగారు హిందూపురం.

10 శ్రీ కట్టా విశ్వనాథయ్య శ్రేష్ఠిగారు, స్టేషనరీ మర్చెంటు, హిందూపురం

11 శ్రీ కె. ఆర్. క్రిష్ణయ్యగారు, మునిసిపల్ ఛేర్ మెన్, హిందూపురం

12 శ్రీ జైసాని సూర్యనారాయణయ్య శ్రేష్ఠిగారు, హిందూపురం.

13 శ్రీ పొంతి రావుసాహేబ్ భీమయ్య శ్రేష్ఠిగారు, హిందూపురం.

14 శ్రీ కె. యం. నాగయ్య శ్రేష్ఠిగారు, ప్రొప్రయిటరు, శ్రీవిష్ణు ప్రింటర్స్, హిందూపురం.

15 కట్టా కోనేటయ్యగారి సూర్యనారాయణయ్య శ్రేష్ఠిగారు హిందూపురం

16 వేముల ఏకాంతప్ప శ్రేష్ఠిగారు, పెట్రోలు బ్యాంకు, కల్యాణదుర్గం.

17 నరసేపల్లి సత్యమయ్య గారు s/o నరసేపల్లి వెంకటస్వామిగారు, శ్రీ వేంకటేశ్వరనిలయం, పామిడి. (అనంతపురం తా॥)

# పో ష కు లు

## (రూ॥ 10-0-0)

1 శ్రీ వైద్యభీమక్ రామశర్మగారు B. M. P. కల్యాణదుర్గము
2 శ్రీ యస్. నరసింహశాస్త్రిగారు బస్ ఓనరు కల్యాణదుర్గము
3 శ్రీ గంగారపు రామప్ప శ్రేష్ఠిగారు మర్చెంట్, ,,
4 శ్రీమతి జి. లక్ష్మీదేవమ్మగారు హెడ్‌మిస్ట్రెస్సు హైయర్, ఎలిమెంటరీ బాలికా పాఠశాల, కల్యాణదుర్గము.
5 శ్రీ కరణం సత్యనారాయణరావు గారు కిశోర కవితాసమితి అధ్యక్షులు, మడిగల్లు (కల్యాణదుర్గం తా॥)
6 శ్రీ యం. వెంకటేశ్వరరావుగారు ఎనుముల దొడ్డి కల్యాణదుర్గం.
7 శ్రీ టి. గురుమూర్తి గారు, మరియు టి. ఛాయప్పగారు, భూస్వాములు, మలుగూరు, (హిందూపురం తా)

N. B. పోషకులవలెను, క్రొత్తగా చేరినవారి నామము లిందు ప్రకటింపబడినవి. పాత క్రొత్తఅభిమానులయొక్కయు పోషకులయొక్కయు లిస్టు సవరించి, పుస్తకరూపమున త్వరలో ప్రకటింపబడును. అందులో గ్రంథమాల జమా ఖర్చులు తెలుపు (Balance Sheet) కూడా ప్రకటింపబడును. పైన తెల్పిన పట్టీలో పూర్తిగా తమవిరాళములు, చెల్లించినవారికి మాధన్యవాదములు ఇంకను, విరాళములు బాకీ యున్నవారు, తమ విరాళములను త్వరలో పంపి, మేము చేయుచున్న సారస్వతసేవ నాదరింపవలయునని వేడికోలు.

న మ స్తే

(సెక్రెటరీ.)

# సంపాదకీయములు

'లోకో భిన్నరుచిః' అను నుడిచొప్పున, మద్రుచులలో, ఒక్కొక్కరి కొక్కొక్క రుచిమీద అభిమానమెక్కువ. అందఱి కొక్క వస్తువే ప్రీతియైన ఈప్రకృతిలో పలువిధములైన, జంతువులు, వృక్షములు, ఫలపుష్పము లుండజాలవు. భిన్నరుచులు, భిన్నసాంప్రదాయ, ఆచార వ్యవహారాదు లవశ్యకముగా నుండవలసినవే. ఏకత్వములో భిన్నత్వము, భిన్నత్వములో ఏకత్వము కలదు. లోకైకమార్గ మొక్కటే. ప్రపంచమున కాదర్శ గుణముల బోధించుటకై, శ్రీ పరమేశ్వరుడు దశావతారము లెత్తెను. మఱియు ననేక భక్తుల యవతారములనెత్తి లోకమును ప్రభోధించెను. ఇదియ్యదియే లోకకల్యాణ కారణము.

అదేరీతి, ఆంధ్రభాష పలుపోకడలు బరువులెత్తినది. పద్యకావ్యములు, గద్యరచనలు, వ్యావహారికములో వ్రాయబడిన అనేక రచనలు గలవు, పద్యకావ్యములలో ఛందోలక్షణ బంధములు, భావగీతములు, తందనాలపాటలు, జానపద గేయములు, లెక్కకు మిక్కిలిగా నేడువెల్లి విరిసినవి. అభ్యుదయరచనలని నవకవులు, యువకవులలో కొందఱు, ఛందోలక్షణములు బాటింపక, యతిగణప్రాసముల లక్ష్యపెట్టక, వెఱ్ఱిమొఱ్ఱిపరువులెత్తుచున్నారు. వ్యావహారిక భాషయే, యుండదగినదంచు గ్రంథస్థమునకాభాషయే, యోగ్యమని వాదించువారు పలువురు కలరు. తెలంగాణావారి భాష- ఉత్తరాదివారికి, ఉత్తరాదివారి భాష, రాయలసీమవారికి రాయలసీమవారిభాష, తదితరులకు నర్థముగాకుండిన, ఏవ్యవహా

ఏకభాష గ్రంథస్థము కావలయునో, తెలియకున్నది. శిష్టవ్యావహారిక మేదియో, దుష్టవ్యావహారిక మేదియో, పండితులు, కవులు, భాషావేత్తలు నిర్ణయింపవలసిన పరిస్థితు లేర్పడినవి. ఈ ప్రకారముగా, ఆంధ్రభాష పలుపోకడలతో, భిన్నరూపములతో భిన్నరుచులతో వెలయుచున్నది. అయితే షడ్రుచులలో నేయే రుచు లే యే పరిమాణములతో కలిపిన స్వారస్యమైన వంట తయారగునో తెలిసికొనవలయును. అదేరీతి, తెలుగు జిలిబిలి, వెలుగులు సడలనీక, సకలాంధ్రుల కమృతోపమానమైన తెలుగు బాస వెలయవలయును. విజ్ఞులీవిషయమై, ఆలోచించెదరుగాక!

కొందఱకు, పద్యకావ్యములపై మక్కువ మెక్కువ. పద్యములే, కవిత్వమున కాధారమని కొందఱందురు. వచన రచన కూడా కవిత్వమనిపించుకోదా? భావమే ప్రధానమని మఱి కొందఱందురు. ఛందోబద్ధమైన కవిత్వాభావములు కుంటువడును. కవిత్వమును శృంఖలములచేత బంధింపరాదు. కవిత్వము స్వేచ్ఛగా గంగాప్రవాహమువలె బరువెత్తవలయును. యతిగణ ప్రాసబంధము లుండరాదనువారు కొందఱు.

వచన రచనకూడ దీర్ఘసమాస బంధురమై, సంస్కృత జటిలమై యుండరాదు. తేలికగా అర్థము కావలయును. ఇదియొకరి మతము. కొందఱకు నవలలు, డిటెక్టివు కథలు, సినిమా పాటలు కావలయును.

“అందఱిమెప్పింప బ్రహ్మ కలవియెధాత్రిఁ”

అను లోకోక్తి చొప్పున, అందఱి నేమానవుఁడు మెప్పింప జాలఁడు. ఎన్నియో పార్టీలు, భిన్న భావములు, మతములు దేశములో వెలసియున్నవి. ఇయ్యదియే ప్రకృతి సహజగుణమని ముందే నుడివియున్నాము.

ఉత్తమ రచనలేవియో, మధ్యమ రచనలేవియో, అధమ రచనలేవియో నిర్ణయించుట కూడా కష్టము. భారత, భాగవత, రామాయణములు, వసుచరిత్ర, మనుచరిత్రాదులు మనకు గలవు. రామాయణ కావ్యము ననేక కవులు రచించిరి. కవి త్రయమువారి భారతమేకాక, నేఁడు శ్రీకృష్ణ భారత, భాగవత రామాయణములు వెలసినవి. ఇందెయ్యది ఉత్తమకావ్యము ? శ్రీవిశ్వనాథ సత్యనారాయణగారి శ్రీరామాయణ కల్పతరువుపై, విమర్శనలు రాలేదా? శ్రీ గడియారమువారి, శివభారతముపై విమర్శనలువెలువడలేదా? రంధ్రాన్వేషణమే,యుద్దేశ్యమై వెలయు వారికే, ఉత్తమకావ్యములు హీనములై,హీనకావ్యములే అత్యుత్తమములగును.

బళ్ళారి శ్రీకృష్ణమాచార్యులవారు, కోలాచలం శ్రీనివాస రావుగారు యెన్నియో నాటక రాజములను వ్రాసిరి. ఆకాలములో వాటికి ప్రాశస్త్యముండెను. నేటి సినిమా యుగములో ఆ నాటకముల మేటి కీర్తి తగ్గినది. అట్లని ఆచార్యులవారు, రావుగారు, వ్రాసిన నాటకములు రసవంతముగ లేవనిచెప్పవలసినదేనా? కృతులన్నియు, నాచంద్ర తారార్కముగా నుండవలయునా?

ఇది సాధ్యమా? ఆంధ్రప్రచారిణీ గంథమాలవారు, సార

స్వాత మండలివారెన్ని నవలలను ప్రకటించిరి? అవి ఇప్పుడు చదువువారున్నారా? డిటెక్టివు నవలలెన్ని యిప్పుడుత్పత్తియగుచున్నవి? ఉబుసుపోకకు చదివి పారవేయవలసిన, యీచెత్త పొత్తములే నేడగ్రస్థానము వహించి, శ్లాఘనీయమగుచున్నవి. ప్రజాసామాన్యము నాకర్షించుచున్నవి. ప్రజాదరణపొంది, డబ్బు గడించుచున్న, ఈ పుస్తకములే కొందరి దృష్టిలో ఉత్తమ పుస్తకములు కావచ్చును. కోటిశిలలలో, అన్నియు వజ్రములు కాజాలవు. ఏదియో ఒక చిన్నశిల, వజ్రము కావచ్చును. అయితే శిల లప్రయోజనము లనవచ్చునా? మట్టికుండ కొన్ని దినములలో శిథిలమగును. ఇనుప కడవ కొన్ని నెలలలో గండ్లు పడును. ఇత్తడిబిందె కొన్ని యేండ్లుండును. వెండి బంగారు పాత్రలు సదా వెలసియుండును. అదేరీతిగా సాహిత్యము కాలాను సారముగా వృద్ధి క్షయములను బొందుచుండును.

కాన గ్రంథాన్వేషణమే, పనిగా గొన్నవారికి, యెవ్వరేమి చెప్పినను రుచింపదు. కాలమే కవియొక్క కీర్తినిగాని అపకీర్తినిగాని తేగలదని మా విశ్వాసము.

ఈ గ్రంథమాల, ఈ పుస్తకముతోబాటు 14 పుస్తకములను ప్రకటించినది. ఇందులో 7 పద్యగ్రంథములు, 5 నవలలు, 2 నాటకములు. గ్రంథకర్తలు సుప్రసిద్ధులైనవారు. కావ్యతీర్థులు, P.O.L. బిరుదు సంపాదించినవారు, సాహిత్య సరస్వతులు, కవిశేఖరులు, విద్వాన్ బిరుదుగలవారే గ్రంథకర్తలు. తమ అద్భుత రచనా నైపుణ్యముచే, ఆంధ్రప్రపంచానికే గ్రం

థమాల వారినుండి బహుమానములు పొందినవారే మా నవలా సృష్టికర్తలు. 'భారతి' 'గృహలక్ష్మి' మొదలైన మేటిమాస పత్రికలు పై గ్రంథముల నపూర్వముగా పొగడినవి. ఇక, ఈ గ్రంథమాల, యేయొక్క ప్రదేశమునకు సంబంధించినది కాదు. గ్రంథమాల సంచార గ్రంథాలయముకాన, ఆంధ్ర ప్రదేశమందంతట విహరింపగలదు. కాలక్రమమున, కవి పండితుల నందఱిని ఈ గ్రంథమాల ఆకర్షింపగలదు.

శ్రీ పరమేశ్వరుఁడు మా ప్రయత్నమును నిర్విఘ్నముగా నెఱవేర్చుగాక !

సంపాదకుఁడు.

# మనవి



'భక్తమందారము' కారణాంతరములచే సకాలమునకు వెలువడ జాలకపోయెను. ఇందుకు మా చందాదారులు మమ్ము మన్నింపఁబ్రార్థన. గుణగ్రహణ పారీణులైన పాఠకుల ముందు, ఈ 'ద్విశతి' నుంచినాఁడను. గుణములా భక్తమందారుఁడైన పరమాత్మునివి. అవగుణంబు లల్పజ్ఞుఁడైన నాయవి.

ఇట్లు విన్నవించు,

గ్రంథకర్త

శ్రీ మేధాదక్షిణామూర్తయే నమః

# తొలిపలుకు

పిపీలికాది బ్రహ్మపర్యంతము గల ప్రతి ప్రాణియుఁ గోరునది సుఖప్రాప్తి, దుఃఖనివృత్తి—ఈ రెండు మాత్రమే. ఎవరెన్ని కోరికలు కోరినను ఈ రెంటిని సాధించుట కొఱకే యని చెప్పవచ్చును. ఇంతకు భిన్నముగా మఱొకటి కానరాదు. ఈ విధముగాఁ గోరుకొనుటయేగాని వీనియొక్క—ప్రాప్తి—నివృత్తులకు కర్తలు కాఁజాలరు. కాక పోయినను వాంఛ మాత్రముదయించుట అది సహజము.

సుఖదుఃఖానుభవములలో, ప్రతి ప్రాణికిని, అనుభూతి పరిణామము లేదో యొక రకముగా వ్యక్తము లగుచునేయుండును. అట్టి యనుభూతి విశేషము లాంగికాది వికారములతో వ్యక్తముకావచ్చు; వాగ్వ్యాపారములతో వ్యక్తముకావచ్చును. వాగ్వ్యాపారమునకు నోచని స్థావర జంగమ ప్రపంచములో స్థావరములైన తరులతా గుల్మాదులయందు సౌవర్ణ్య వైవర్ణ్యాదుల చేతనే అవి తెలియనైయుండును; పశు పక్ష్యాదులలో స్థావరముల కంటె విశేషించి కంఠస్వర విశేషముచేఁ దెలియఁదగియుండును. ఇఁక మానవ ప్రపంచములోఁ దదితరములకంటె విశిష్టముగ సంభాషణ సౌభాగ్యములతో వ్యక్తపఱుప నవకాశము గల్గియున్నది.

ఇట్టి మానవులలోను—వట్టి మాటలతోఁ దమ సుఖదుఃఖానుభవములను పైకి వ్యక్తపఱచువారే పెక్కుమందిగా నుందురు. వారిలో కవితాకళోపాసకులుగా, నుండువారు మనోగతాభిప్రాయములను మాటలతోఁ గాక స్వతః ప్రభావముతో వాని కొక రూపము గల్పించి తమ పరోక్షమునందుఁ గూడఁ దమ పలుకుబడులనే యథాతథముగఁ బాఠకులచేఁ బలికింతురు.

అట్టి కవితా కళారాధకులలోను, కావ్య నిర్మాతలగువారు కథావస్తువు నందలి పాత్రలతో నైక్యమునొంది సందర్భించిన ఘట్టములలోఁ దమ మనోగత భావములను మేళవించి యాలపింతురు. కొందఱు కథావలంబనము లేకుండనే ఆదినుండి అంతము వఱకును ఆత్మగతములైన యభిప్రాయములను ముక్తకంఠముతో ముంచి వేయుదురు. ఈ స్థాయిలో వ్రాయఁబడిన రచనలే శతకములు

శతకములు భక్తి జ్ఞాననీతి వైరాగ్య ప్రతిపాదకములుగా పలుశతకములతో వెలసినవి. సర్వశతకములకును సమష్టి మీఁద పైవిషయములే పరమ లక్ష్యములైయున్నను ఒక్కొక్క విషయమే ప్రధానముగా సాఁగిన రచనలు సూతఁ గొన్ని లేకపోలేదు. రచయితయొక్క చిత్తవృత్తి ననుసరించి విషయ విభాగము వర్ణ్యవస్తువయియుండును. అట్టి శతకముల జాతికిఁజెందినదే యీ భక్తమందారము.

శతకమనగా సంఖ్యామానమున 'నూఱు' అని పరిమితార్థమైనను, అనంత సంఖ్యలకును అది యర్థావబోధకమగుచున్నది-గనుక ఈ భక్తమందారము, రెండు శతకముల దాఁక సాఁగి అంతట ఆగినది.

వస్తుసామగ్రియొక్క పౌష్కల్యమును బురస్కరించుకొని వాస్తవ కవిచేతిలోని లేఖిని యెంతచులుకుగా సాగినను సాఁగినదేగదా! కనుకనే గదా వేమన శతకము వేలపద్యముల కాస్పదమైనది!

శతకవాఙ్మయమంత ఆర్తభక్తనియార్తి నిర్వేదముల యాలాపములతో నిండినది గానే యుండును. భగవంతుని భజించు సుకృతాత్ములగు చతుర్విధ భక్తులలో ఆర్తభక్తుఁ డగ్రస్థానము నధిగమించి నట్లుగా భగవద్వాక్యము.

శ్లో॥ చతుర్విధా భజన్తేమాం
జనాస్సుకృతినోఽర్జున !
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ
జ్ఞానీచ భరతర్షభ ! అని

(గీతవిజ్ఞానయోగః)

అనేక జన్మ పుణ్య పరిపాకవశముచే జ్ఞానోపార్జనము చేసికొన్న తరువాత ఆధ్యాత్మికాద్యుపద్రవములచేఁ నిష్పీడితుఁడై ఆర్త భక్తుఁడు భరింపఁజాలక తదుపద్రవ నివృత్త్యర్థము సర్వోపద్రవ సంహారకుఁడగు సర్వేశ్వరునితో మొఱపెట్టుకొనును. శతక కర్తలందఱును ఈ యార్త భక్తకోటికిఁ జెందిన వారుగానే యుందురు. ఆ కోటికిఁ జేరినవారే యీభక్తమందార శతక కర్తలును. వీరికిఁ గలిగిన యార్తియు తన్నివృత్త్యుపాయాన్వేషణాదులును ఈ స్వరూపముతో వెలసిన వన్నమాట.

ఈ భక్తమందారమును వ్రాసినవారు హిందూపుర వాస్తవ్యులు శ్రీ కల్లూరు అహోబలరావు గారు. 'భక్తమందార! నీకిదే వందనంబు' అను శీర్షిక పెట్టుకొని రెండు వందల సీసపద్యములతోఁ దమలోఁ గలిగిన జిజ్ఞాసను, ఆర్తిని, నిర్వేదమును, నితని నిక్కచ్చిగ వెళ్ళఁగ్రక్కియున్నారు. సనాతన నాధునాతన ప్రపంచసంప్రదాయముల నన్నిటిని ఒడఁబోసి మూసగట్టినారు. సర్వాన్తర్యామియగు ఆత్మవస్తువు మొదలు, సర్వధ్వంసకములగు ఆటంబాంబు, హైడ్రజన్ బాంబు మొదలైన ఆధునిక మారణ యంత్రముల వరకును మంచి చెడులను గుర్తించి గాలించి వైచినారు. ఒక్కమాటతోఁ జెప్పవలెనన్నచో, శతేపంచాశద్వత్ అనఁగా, నూఱు అనగానే యేఁబది యను సంఖ్య గూడ అందులోనే యిమిడియున్నట్లుగా ఈభక్తమందారములో తడవి తాఁకని యంశమనునది లేకుండ అన్ని యిమిడియున్నవని చెప్పవచ్చును.

సృష్టి రహస్యమును గురించి భక్తమందారుని ప్రశ్నించియున్నారు. భగవత్తత్త్వమేమో జిజ్ఞాసించినారు. జీవేశ్వర జగత్తులను గూర్చి చర్చించినారు. అవతారమూర్తులను, ఆచార్యవర్యులను, ఆధ్యాత్మతత్త్వమును ఆరాధించు భక్తులను, వారి వారియనుభూతి విశేషములను విశదీకరించినారు, వేయేల? ఐతిహాసికముగను, ఆధ్యాత్మికముగను చారిత్రికముగాను, సాంప్రదాయికముగాను పురాతన కాలమునుండి అధునాతనకాలము వఱకును గల యన్ని విషయములను ఎడపెడ సవ్యాపసవ్యములతో కడిగి గాలించి నారనుట యొక్కటే చివరి మాట. ఇతఃపూర్వ ప్రచురితములైయున్న శతకము కంటెను ఇందులో పాఠకలోకమున కుపాదేయములైన క్రొత్త యంశము లనేకములు సంఘటితములైయున్నవి. ఇంతకంటె రచనకుఁ గావలసిన ప్రయోజనమేమి?

శ్రీ కల్లూరు అహోబలరావు గారాంగ్ల విద్యాధిపులై రాజకీయాధికార పదవి నధికరించి కూడ మాతృభాషనుపాసించి ధారాళమైన కవితాధారతో గ్రంథరచనకుఁ గడంగినారనుట గర్వింపఁదగిన విషయము. అంతరాత్మను హత్తుకొనియున్న యాశయములను పలుకుబడికిఁ దెచ్చుకొని పద్యములలోఁ బ్రకటింపగల శక్తి వీరికి భగవత్ప్రసాదితముగా భావింపఁదగియున్నది.

శ్రీరావుగారు, కవితా కళారాధకులగుటయేగాక, బాలకాలమునుండి శ్రీ కృష్ణదేవరాయ గ్రంథమాలయని యొక గ్రంథమాలను స్థాపించి, తన్మూలమున, పెక్కుమంది కవుల రచనలను ముద్రించి, పాఠకలోకమున, కందించుట చూడఁగా 'స్వయం తీర్ణః పరాంస్తారయేత్' అను సూక్తి వీరియందు సార్థక్యమును సంపాదించుకొన్నదని చెప్పవలయును. వీరికృషికి చిన్మయరూపుఁడగు భగవంతుఁడు సర్వతో ముఖముగఁ దోడ్పడుఁగాక యని యాశించుచున్నాను.

ఏది భవిష్యత్ప్రచనోద్యోగము ఏస్వరూపముతో వెలయనున్నదో కాలమున్నది, చూడఁగాఁ గనులు గలవు!

ఇట్లు
భాషోపాసకుఁడు

కవితా సామ్రాజ్యము,
[illegible] ద్వా [illegible]

విద్వాన్ కావ్యతీర్థ, మద్దులపల్లి
వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి



# అభిప్రాయము

కం॥ నందన మందారము, సుర
సందోహానందకర కుజంబది, భక్తా
నందన మందారము, బుధ
బృందానందకరప్రవృత్తింబిదియున్॥ 1

కం॥ రక్తిం దెలుఁగువారు, గనుం
భక్తిమెయి న్వ్రాలఁగ 'భక్తమందారం' బ్రా
సక్తి సలిపె నీనవ్య మధు
రోక్తులఁ గల్లూరి కులుఁడహోబల సఖుఁడున్॥ 2

కం॥ కల్లూరి యహోబలరా
వెల్ల తెనుఁగువారు జనియ నీకతక యుగం
బల్లె మనోహరశైలి, స
ముల్లసితాత్మజని ధన్యమొందఁగ జగతిన్॥ 3

గీ॥ ప్రతిభకుం, దగుభావముల్, భావములకుఁ
దగుపదములు, పదములకుఁ దనర కవిత
కవితకుందగు ప్రకృతి వస్తువును గుదిరెఁ
బ్రథిత కల్లూరహోబలరాయ సుకృతిన్॥ 4

గీ॥ ఇంటిపేరు 'కల్లూ' రైననేమి? మనము
వెన్నవలె మార్దవంబని యెన్నజనము
మధుర మంజులమగు నీదు మాట ఘనము,
చెలి! యహో! బళ! నీకాత్మ బలము-ధనము॥ 5

ఉత్పలమాలిక :—

మారమణావతారము, లమంద తదీయ విచిత్రలీల, లు
త్ప్రేరిత దివ్యబోధకు లురీకృత సుందర శాంతి సత్త్వలుఁ
భారతభాగ్యదేవత, లవారిత సృష్టి మహత్త్వశోధనో
త్సారిత వస్తుతత్త్వ మహితజ్ఞులు, మాతృవిలాతి భక్తులుఁ
భూరితరారివర్గ మదమోహ విదారణదక్షులొక్కరా ?
పేరిమిఁగల్గు పెక్కురు, వివిక్తయశస్కు, లికెందఱెందఱో ?
కూరుచు పుత్రులాంధ్రికి, నకుంఠిత సేవ లొనర్చువారు, క
ల్హారి, యహోబలాఖ్య కవియుజ్జ్వలలేఖిని చిందులాట సిం
గారమునం దుదార సహకారముచేయఁగఁగావ్య వీథి, ని
న్నారు ప్రశస్త పద్యపు మణుల్ రవణింపఁగ నృత్యపాటవం
బారవిచంద్రతారకము నాదటఁజూపుచు మెల్ల, 'భక్తమం
దారము,' శ్రీప్రియుండు కరుణారసదృష్టులఁగాచుఁగావుతఁ॥6

[కల్హారు — జాతియూరని — చెలి! అహోబళ! — అను నెడఁ దమ యభిఖ్యను ఆశ్చర్యార్థ సూచకముగ 'అహో' — 'బళ' యని చమత్కరించితి. క్షమింపుడు (5వ పద్యము) 'నందన' మందారము — స్వర్గలోకపు మందారవృక్షము. భక్త + ఆనందన మందారము — భక్తులకానందమిచ్చు మందారము — అనుకావ్యము అనిభావము. (౧వ పద్యము)

కవిత, అనర్గళ ధారాశోభితమైనది. ప్రాచీన శతక పద్య భావచ్ఛాయ లటనట గోచరించినను, నూత్న భావములును లేక పోలేదు. అత్యంత లలిత లలితముగ, మాధ్వీ మాధురీభరిత ముగ, మనోజ్ఞ 'శయ్యాసముపేతముగఁ గవిత్వము సాగించు, ఈ నాఁటి కొలఁది మంది కవులలోఁ శ్రీ రావుగారు కూడ నొక రని నా హృదయ పూర్వకాభిప్రాయము. స్వతంత్ర భారత యువ కవులు నేర్వఁదగినవియు, సరస జనులాకళింపఁ దగినవియు, భావితరముల వా రాదర్శములుగ గ్రహింపఁదగినవియునగు, నతి మాత్రాంశములకుఁ శ్రీరావుగారి కబ్బము పుట్టినిల్లు. ఇందునారు దనవని విషయములు మృగ్యములు. ప్రశంసింపని మహాపురు షుఁడు లేఁడు. చర్చింపని సంఘ సంస్కరణము లేదు. నుతింపని యవతారమూర్తి లేదు. ఎఱిఁగింపని విజ్ఞాన జనిత వస్తుతత్త్వము లేదు. వేయేల ? భారతజాతి సహజ స్వరూపము క్రోడీకరణ మొంది, రావుగారిచేఁ గావ్యాకృతినందిన చిన్ని నిఘంటువు వంటి దిది. భవిష్యదాంధ్ర సంతతికిది వాస్తవముగ మందారమే. శ్రియఃపతి శ్రీరావుగారిచే నింకను నిట్టికృతులు పెక్కులుత్ప న్నములగుటకుఁ దగు నాయురారోగ్యభాగ్యము లనవరతము — అనుగ్రహించుగాత.

66, సామిపిళ్ళైవీధి
చూళై-మదరాసు-7

విద్వత్కవిభూషణ
విద్వాన్ వేదము వేంకటకృష్ణశర్మ.
2-6-1958



మిత్రమహాశయా!

న మ స్కా ర ము లు.

మా గురుపాదులు కళాప్రపూర్ణాది బిరుద భ్రాజితులు కీర్తిశేషులగు శ్రీ॥ జనమంచి శేషాద్రిశర్మగారి శిష్యులు నాకు గురుప్రాయులునగు విద్వాన్ కావ్యతీర్థ మద్దులపల్లి వేంకటసుబ్రహ్మశాస్త్రిగారు కవితాసామ్రాజ్య పట్టభద్రులే మీ కవిత్వము ను మెచ్చుకొని పీఠికను వ్రాసినారన్న మీకవిత్వమును గూర్చిన నా చప్పిడి మాట లక్కఱకు రావనియెద. నా యెడఁగల మైత్రిని బురస్కరించుకొని మీరు కోరుటచేఁ జెప్పెదనొక్క నాలు గొన్న తెలుఁగున,

ఆ॥ వె॥ నీసపద్యమాల సృష్టించి నేర్పుతో
సద్విశేషయు సభవు సమలరూపు
భక్తిఁగొలిచినావు భక్తమందారుని
కలదె నీకు సాటి? కవివిభూష!

శ్రీ గౌతమనికేతనము
సిరిసెర
24-6-1953

అని విన్నవించు స్నేహితుడు
మహాకవి సవ్యసాచి
రెడ్డి భీమరాయగౌతమ

॥ శ్రీ నృసింహాయ నమః ॥

# శ్రీ భక్త మందారము

శ్రీ రమానాథ! ఆశ్రితజనరక్షకా!
నాదగానప్రియా! ప్రేమమూర్తి!
వేదస్వరూపప్రకాశ! విజ్ఞానజలధి! బ్ర
హ్మాండముల్ సృష్టించు-సర్వమూర్తి!
హరి హర బ్రహ్మరూపైకమహాత్మ! అ
పార తేజోనిధి! ప్రాజ్ఞమూర్తి!
పదునాల్గు లోకంబు లుదరగర్భములోన
రక్షించుచుండెడి రసికమూర్తి!

పరగ నోంకారమూలమై పరగుమూర్తి!
లోక కల్యాణమొసఁగు స్వర్లోకమూర్తి!
మోహనాకారమొప్పిన-ముద్దుమూర్తి!
భక్తమందార! నీకిదే వందనంబు॥ 1

కమ్మగాఁబల్కంగఁ గాళిదాసును గాను
భవభూతి నేఁగాను చవులొసంగ
నాణ్యంబుగా వ్రాయ నన్నయ్య నేఁగాను
తిన్నగాఁబల్కఁ దిక్కన్నఁ గాను

ముద్దుగా వ్రాయంగఁ బెద్దన్న నేఁగాను
రామకృష్ణుఁడఁగాను రసము జిలుక
బింకంబుగా వ్రాయఁ గంకంటి నేఁగాను
శ్రీనాథుఁడనుగాను ప్రాసవ్రాయ

గీ॥ చెన్నుగా వ్రాయ - నేను, పోతన్నఁగాను
కావ్యములు బఠింపగ లేదు ; కవిత నెఱుఁగఁ
దిద్ది తీర్చు భారము నీదె తెలియుమయ్య !
భక్తమందార ! నీకిదే వందనంబు॥ 2

సీ॥ త్యాగరాజునుగాను-రాగంబుతోఁ బాడ
రామదాసుఁడగాను ప్రేమ నొసఁగ
శ్రీకబీరుఁడగాను - చింతించి కీర్తింపఁ
దులసిదాసుఁడగాను తలపభక్తి
ప్రహ్లాదుఁడనుగాను భక్తితో సేవింపఁ
దోరంపు తపసున ధ్రువుఁడగాను
నయమున స్తుతియింప నారదుండను గాను
అండఁజేరఁగఁ గుచేలుండగాను

గీ॥ భక్తి భావంబు సున్న - విరక్తి లేదు,
రక్తి నీమీఁదఁ గలిగె ; నాసక్తి హెచ్చె ;
సన్నుతించెదఁ దప్పుల నెన్నవలదు ;
భక్తమందార ! నీకిదే వందనంబు॥ 3

సీ॥ వాణి ! పద్మజురాణి ! వీణమీటగదమ్మ
నా తెంపు బలుకుల నటన కొఱకు

భారతి ! కర్పూర హారతిఁగైకొమ్మ
  సారథివై , కైతనాగుకొఱకు
శారద ! గీతవిశారద ! జేజేలు !
  హితసాహితీ సుసంగతుల కొఱకు
కామలలామ ! సరస్వతి ! కైమోడ్పు
  లానంద భావంబు లబ్బుకొఱకు

అమ్మ ! భార్గవి ! అమ్మల కమ్మ వీవు !
నమ్మితి గవిత్వధారల నిమ్మదేవి !
లక్ష్మి ! ప్రార్థింతు నిత్య కల్యాణమిమ్ము ; భ॥ 4

వచ్చినంత వచింతు - వైకుంఠవాస ! నీ
  సచ్చరిత్రమునకు జంకులేల ?
తెలిసినంత లిఖింతు - దీనబాంధవ ! నాకు
  తెలియని దానికై - తలఁపులేల ?
ఎఱుకయున్నంత - నిన్నెఱిఁగి కీర్తింతును
  తోయజనేత్ర ! బడాయియేల ?
బుద్ధియున్నంత నిన్బొగడి నుతింతును
  వాక్చాతురీ వైభవంబులేల ?

తప్పులుండినఁదిద్ది సౌందర్య మొసఁగ
శక్తిలేదె ? నీయుత్సాహ శక్తియొకటె
నమ్మి లిఖియించువాఁడ ! నిజమ్ము దేవ ! భ॥ 5

సీ॥ కోయిల కంఠానఁ గోమల స్వరముల
నింపుగాఁగూర్చి, కూయించినావు
నిర్ఝరంబుల మృదు నిస్వనం బెలయించి
చిత్త మాహ్లాదింపఁ జేసినావు
వేదంబులను, శ్రావ్య నాదంబుతో నింపి
వీనుల విందు గావించినావు
వేణునాళంబులోఁ బ్రేమనాదముఁబోసి
యంచితంబుగఁ బలికించినావు

గీ॥ సీ కరుణలేక పల్క వాల్మీకిగాక
దేకవులకేని సాధ్యమే? లోకమందు
నాకవిత్వాన మధురిమఁ బ్రోకనిమ్ము; భ॥ 6

సీ॥ అంతరాళంబెల్ల - నావరించిన నిన్ను
దేవాలయమున, బంధించు టేల?
పరిశుభ్ర గాత్రుఁడై - వఱలుచుండెడి నిన్ను
జలకమాడించెడి తలఁపులేల?
ప్రకృతి సంపదలచే - రమణీయుఁడగు నిన్ను
శృంగారమును జేయు - చింతలేల?
పూజ్యతగాన్చట్టి - పురుషోత్తమా! నిన్ను
చెలువు బుష్పములఁ బూజించు టేల?

గీ॥ అమృత జీవనుఁడైన, నీ యాత్మకరయ
షడ్రసోపేత భోజన సమితి యేల?
నిత్యపరిపూర్ణ! దురిత రాహిత్య హృదయ! భ॥ 7

సీ: పున్నమ జాబిల్లి - మురువు మర్మములోని
  యంతరార్థంబు నొక్కింత దెలిసి
రెక్కల తళుకులో - నిక్కయాడెడి యందాలు
  వెలిఁది మొయుయూరంపు నిఘము సరసి
'కొక్కొ-రొక్కో' యను కోడికూతఁజెలంగు
  హెచ్చరిక నినాద ముప్పతించి
చివురు టాకుంబులఁ జెలువారు సౌహార్ద్ర
  తత్త్వసారము నిండు తమిని గ్రోలి
గీ: పాల పసిపాప ముసినవ్వు పసనెజేంగి
విరుల నెత్తావి సొంపు సంబరము లరసి
నిన్నుఁ జింతించు వాఁడె సంపన్నుఁడరయ భ॥ 8

సీ॥ శిలయందు వజ్రంబు మొలిపించి నీ దివ్య
  శక్తినె పుణ్యంబుఁజాటినావు
నారికేళఫలంబు నందు, నీరముబోసి
  నీరహస్యంబు వర్ణించినావు
ఫణిఫణాగ్రమునందు భవ్యమాణిక్యంబు
  చిత్రించి నీకట్టుఁ జెప్పినావు
అండంబులోఁబుల్గు నడఁగించి నీ సృష్టి
  మించు చాతురి వెల్లడించినావు
గీ: చిత్రవర్ణంబు పూలకుఁజేర్చినావు
కూర్చినాఁడవు ప్రకృతికి గొప్పచెలువు
ప్రకృతి మధురస్వరంబులఁబాడినావు భ॥ 9

సీ॥ నీలాంబరంబొండు నెత్తిపై సృజియించి
చుక్కలరాశితో సొబగుఁగూర్చి
సూర్యగోళమొకండు సొంపుగా సృష్టించి
కిరణాలలో వేడిఁగీలుకొల్పి
చందమామను, ప్రేమ నందంబుగాఁదిద్ది
చలువరాసులను, కొల్లలుగఁజల్లి
మేఘ మాలికలందు మెఱపుల మెఱయించి
యందులోఁబిడుగులఁబొందుపఱచి

గీ॥ ప్రకృతి వైభవమును జక్కఁబఱచినావు
మంచివాఁడని బిరుదువహించినావు
మించు నీగుట్టు నెవరు వర్ణింపఁగలరు ? భ॥ 10

సీ॥ అత్యద్భుతంబైన యంతరాళంబున
నఖిలాండ కోటుల నాడఁజేసి
బంతుల చందాన వింతగా వానిని
నొకదానిచుట్టు, మరొండుతిప్పి
పవలు, రాతిరిఁజేసి - వారంబు లొనగూర్చి
నెలలు, ఋతుల్ వర్షములను జేసి
ఎండవానల గురియించి, శీతమొసఁగి
పాడిపంటల వైభవమ్మునించి

గీ॥ ప్రాణికోట్లను సతము కాపాడుకొఱకు
కన్నకష్టములను గూడఁ గాంచినావు
నీ రహస్యంబు నెవరు వర్ణింపఁగలరు ? భ॥ 11

సీ॥ కోకిల కింపైన కూజితంబు నొసంగి
నల్లని రంగేల జల్లినావు?
గేదంగిమొగ్గ కామోదంబు నొడగూర్చి
యంచుల ముండ్లేల నుంచినావు?
చుక్కల దొరనెంతో చక్కగా సృష్టించి,
హాని వృద్ధులనేటి కతికినావు?
సంద్రమింకని యట్లు జలమున నిండించి
క్షారంబుగానేల సలిపినావు?

గీ॥ కోబలంబిచ్చి కవులకుఁ దీఱదాని
పేదతికమేల నొసఁగితి పెద్దగాగ?
నీ రహస్యంబు నెవరు వర్ణింపఁగలరు? భ॥

సీ॥ కడుపు నిండఁగఁగూడు గంజలేని పేదల
సంతానభరముచేఁ జంపనేల?
సిరిమూల్గి పడియున్న శ్రీమంతులకు సంతు
పుట్టక, దుఃఖంబు పుట్టనేల?
సాధుసజ్జనులకే - సంకటంబులఁగూర్చి
నిత్యంబు వారిఁ గుందింపనేల?
కపటులై చెనటులై కఠినాత్ములగువారి
కభివృద్ధి గలిగించి యరయనేల?

గీ॥ రంగుగా జూడ బంగారు రంగుమాతె
కాకె బంగారు మిగుల ముఖ్యతవహించె;
నీ రహస్యంబు నెవరు వర్ణింప గలరు? భ॥

సీ॥ సప్తసాగరములు, సతతంబు నీ శక్తి
  సిరశబ్దములను, ఘోషించుచుండు
వాహినీస్వనము, నీయూహాప్రపంచంబుఁ
  జాటి చెప్పుచునుండు మేటిగాగ
సప్తమారుతములు, శబ్దించు నే వేళ
  నీకీర్తిచరితంబు లోకములకు
ఊర్జితంబుగవచ్చు, నుఱుములు మెఱుపులు
  నీప్రభావముదెల్పు నిశ్చలముగ

గీ॥ ధాత్రి నీశాంతమును జాటుతఱచుగాను
పర్వతంబులు నీధైర్యబలముజూపు
నిశ్చలాకార ! నిర్మల ! నీరజాక్ష ! భ॥

సీ॥ క్షీరంబులోనున్న నీరంబుఁ బోఁద్రోసి
  యమృతంబుఁ గ్రోలు రాయంచనేర్పు
సింధుజాబిల్లి వెన్నెలతీపి గ్రహియించి
  భుజియించు వెన్నెలపులుగునేర్పు
శ్రీరామనామంబు గారాబమున నేర్చి
  కులుకుచుఁ బలికెడి చిలుకనేర్పు
ప్రియులకుఁ బ్రియురాండ్ర ప్రేమసందేశముల్
  గుఱిగఁగొంపోపు పావురమునేర్పు

గీ॥ అన్నినేర్పులు నీయందె యున్నవయ్య !
నేర్పులకు నేర్పరివినీవు నీరజాక్ష !
కొన్నినేర్పుల మముఁబ్రోచికొనుము దేవ ! భ॥

సీ. వరిత్వ్యాం దోఁచునే యక్షీణతారకోటికి,
వెలుఁగునిచ్చుటఁ జూడ వింతకాదె ?
సూర్యుని మించిన చుక్క లున్నవటంచు,
వినుట మహాశ్చర్యమా వింతకాదె ?
ఆధారహీనంబులై గోళజాలముల్,
ప్రేలాడు చుండుట వింతకాదె ?
నిరతంబు భూగోళ మురుగతి చరియించు
విపరీతమరయంగ వింతకాదె ?

గీ. అమిత కావారు మనక్రింద సమరియుంట,
తలఁపఁ దలక్రిందులగుఁగాదె ? తథ్యముగను
వింతలకునెల్ల నిది పెద్దవింత కాదె ! భ॥ 20

సీ. భూమండలంబొండు పొలుపార నిర్మించి
జల, భూవిభాగంబు జక్కఁజేసి
జలరాశిలో, ద్వీప సమితిని గల్పించి
ప్రాణికోటుల నందు బదిలపఱచి
పర్వతశ్రేణి భూభాగంబు నందుంచి
వాహినీ వితతుల బాఱఁగూర్చి
ఘోరాటవుల నెన్నొ గొప్పగా నెలకొల్పి
భీకర మృగముల వెలయఁజేసి

గీ. మనుజు లనియెడి మమ్ముల మనఁగఁజేసి
మహితమైనట్టి విజ్ఞాన మతినొసంగి
విశ్వ విఖ్యాతితో నీవు వెలసినావు ; భ॥ 21

సీ॥ ద్వాదశాదిత్యుల ప్రభ లెందు వెల్గునో ?
యెన్ని లోకంబులో యెఱుఁగలేము
గ్రహరాసు లెక్కడెక్కడ చరియించునో
వాని మర్మము లేమొ పలుకలేము
సప్త ఋషు లాకాశ సౌధంబులోఁ జుక్క
లై, మించు కేలనో ? యరయలేము
ధ్రువబాలకుఁడు కూడ - రవిమించి పై వెల్గు
కారణ మేమియో కాంచలేము

గీ॥ రాహు కేతు గ్రహంబుల యూహ లేమొ ?
భుజగ రూపంబులను వారు పొందినారె ?
యీ రహస్యంబు నెవరు వర్ణింపఁగలరు ? భ॥ 22

సీ॥ లెక్కింపఁజాలని రిక్కలు వెలుఁగొంద
విగ్రదేశములనె, గ్రహింపనేల ?
లక్షల కొలఁదిగా లంక లేర్పడియుండ
నేఁడు దీవులె యున్న వాడుకేల ?
అఖండ ఖండంబులీ ధారుణి నుండ, గ
భస్త్రి, యిదాది భూభాగమెచట ?
పర్వతంబులు కోటపై బడి రాణింప
సప్తకంబనియెడు సంజ్ఞ యేల ?

గీ॥ ఊర్ధ్వలోకంబు లెచ్చట నున్నవయ్య ?
తెలుపగా నధోలోకసంతతులు గలవె ?
నీ సకలరూపు మాకింత నేర్పవయ్య ; భ॥ 23

బాలక్రీడంబుగాఁ గమలాప్తుఁ బుట్టించి
మునిఁగింపఁ జేసెనీ ముద్దుమూర్తి !
చంద్రుని గతిఁదిద్ది చంద్రికల్ నింపారఁ
జల్లఁ దనంబిచ్చు చతురమూర్తి !
అంబోధరంబుల హద్దుపద్దులఁ బెట్టి
పాలించునట్టి సౌభాగ్యమూర్తి !
మతిఁదప్పి వీవక హితముగా వాయువు
వీవ, శిక్షించు ప్రావీణ్యమూర్తి !
ఆహాహా ! ప్రాకామ్యశక్తి ! యత్యంతశక్తి
వశితావేశ సతము ప్రత్యక్షమయ్యె ;
అతురప్రేమజూపు విచక్షణుఁడవు ! భ॥ 24

ఉందురే దేవులా యూర్ధ్వలోకమునందు
మనుచున్నవారొక్కొ మనుజులచట ?
అతపోలోకంబు నందుండు రేమునుల్
జన, భువర్లోకవిచారమేమి ?
పాతాళలోకాధిపతి గాగ శేషుండు
మన్ననతోడుత నున్నవాఁడె ?
కిన్నర గంధర్వ కింపురుషాదులే
యేచోట్లలో వసియించినారో ?

అతల వితల లోకంబుల నడఁగియున్న
జీవరాసుల చిత్రముల్ చెప్పిమాకు
గొంతవిజ్ఞాన సంపదఁ గూర్పవయ్య ! భ॥ 25

సీ॥ నిఖిలసంపదలను నిర్మించి కొమ్మంచు
నీదు దాతృత్వంబు నెమ్మిఁజూపి
తరులు పండించు పదార్థంబు లిప్పించి
రక్తిఁ బరోపకారమ్మెఁదెల్పి
క్రిమికీట కాండజ మృగములఁ బోషించి
భూతదయను బ్రీతిబోధపఱచి
సర్వజీవుల నొక్కసమముగా రక్షించి
కపటంబులేని సంగతినిదెల్పి

గీ॥ విధి విరామములేక, నీవిధులఁదీర్చి
మనుజులకును, కార్యోత్సాహమును ఘటించి
సద్గుణంబుల నేర్పెడి చతురమతివి ! భ॥ 26

సీ॥ బ్రహ్మాండ సంసారవారిధి నీయది
యిట్టి సాగరమెట్టు లీదఁగలవొ ?
అంతరాళంబున నాడెడి గోళంబు
లెన్నికోట్లున్నవో యెఱుఁగలేము
బొంగరంబుల మాడ్కి - రంగార వానిని
త్రిప్పి, జీవుల కేమి ముప్పులేకఁ
గడుపులోఁజలువలఁగదలకుండగఁజేసి
రక్షించుచున్నావు ప్రభువరేణ్య !

గీ॥ ఎట్టిదయగల తల్లివో ? యెన్నికన్ను
లున్నవో ? జీవరాసుల కన్న మెట్టు
లిచ్చుచున్నావొ ? తెలియమో సచ్చరిత్ర! భ॥ 27

అమెరికా యూరోపు లందలి ప్రజలెల్ల
క్రీస్తును సేవింత్రు కీర్తనముల
చైనా, జపానుదేశములందు 'బుద్ధదే
వుని' కొల్చుచుందురు ప్రార్థభక్తి
ముస్లిము ప్రజలెల్ల ముదముతో 'నల్లాను'
గొంతెత్తి కీర్తింతు రెంతొ కౌతుక మలర
భరతదేశమున, ముప్పదికోట్ల దేవతల్
ప్రజలఁ గొలుచుచుంద్రు పొలుపుగాఁగ

నాస్తికులు, ప్రకృతి నుపాసన మొనర్చి
విగ్రహారాధనల నెల్ల వీడినారు
ఏదిసత్యంబు? మిథ్యయదేదొ చెపుమ! భ॥ 28

అవని, యేకోదకమై యున్న వేళ, స
హస్ర శీర్షోరగ మాశ్రయించి
దానిపై, కపట నిద్రాలోలత, నిమీలి
తాక్షుండవై శయనించి హర్షమలర
వేయి యుగంబుల విమలకాలమునుండి
యఖిల లోకంబుల నడఁచి, నుదర
గర్భంబునందు, లోకనికాయము, మఱల
సృష్టింపఁదలఁచి, విస్పష్టముగను

యోచనము, సల్పినాఁడవో యోగివంద్య!
యపుడు, నీనాభిదేశంబునందు, నళిన
నాళముద్భవించి, చతురాననుఁడు బుట్టె; భ॥ 29

సీ॥ పద్మకర్ణికలోన బ్రహ్మ, తానుండి, ది
శాంబరంబులఁజూచి, యమితమైన
యాశ్చర్యమునుబొంది, యంబుజమందున్న
తన్నుఁదాఁగాంచి, యాతత్త్వమెదియొ
తెలియంగఁజాలకఁ దలఁపులోఁజింతిల్లి
'యీ నీటఁ గమలమదెట్లు పుట్టె
నేనెట్లు జనియించి తీవిధముగ, నాల్గు
మోములు నాకెట్లు మొలచెనొకొ- ?

గీ॥ వనజనాళమూలము గాంతు, ననుచు బ్రహ్మ
వత్సర సహస్రములు గష్టపడెను గాని
నీదుమాయలఁ దెలియఁగా నేరడయ్యె; భ॥

సీ॥ ఏ సరోవరవారి, వాసిగా నుండెనో
పాపమా హంసను బట్టనేల ?
అబలమా హంసపై నధివసింపగనేల
స్వర్ణగర్భుఁడు దాను బరువుగాడె ?
బంగారు సొమ్ముల రంగారఁజేయించి
హితమతి భార్యకు నీయరాదొ ?
పేదవారలకైనఁ బిడికె డీయగ రాదొ ?
కడుపులో దాఁచిన గలదె ఫలము ?

గీ॥ నాల్గుమోములఁ జూచినఁ సవ్విపోరె ?
కన్నకూతురు భార్యయై గ్రాలదగునె ?
నీ విచిత్రంబు లెవరు వర్ణింపఁగలరు ? భ॥

సత్యలోకము, నివాసస్థానముగఁజేసి
శ్రీనాథు నాభికమలి లోనఁబుట్టి
తెల్లని తామర నల్లనఁగూర్చుండి
జీవరాసుల నెల్ల సృష్టిఁజేసి
శారద వీణ సుస్వరములు పలుకంగ
నానంద స్వర్గంబు ననుభవించి
జీవకోట్ల లలాట చిత్రంబులను వ్రాసి
కర్మఫలితములఁ గట్టి కడిసి
బ్రహ్మదేవుండై సంసార బంధమందుఁ
జిక్కుకొననేల ? నిజముగ జింతలేదె ?
ఈ విచిత్రంబు నాకు వర్ణింపుమయ్య ! భ॥ 32

ఇంద్రజాలికుఁడవై - యహిరాజు మంత్రించి
దిట్టవై దానిఁ జేపట్టినావు
గాలి నూర్పించి కూడు మాన్పఁగఁజేసి
భయపెట్టి దానిపైఁబండినావు
స్వేచ్ఛగా విహరించు విహంగరాజముఁబట్టి
వాసిగా స్వారిని జేసినావు
పాదంబులను గంగఁ బ్రవహింపఁగాఁజేసి
మించు మాయలను జూపించినావు
చపల చిత్తను బెండ్లాడి కపటవృత్తిఁ
జీరలెల్ల దొంగిలి చెట్టుఁజేరినావు
నీదు మాయల నెఱుఁగంగ నేర్తురెవరు ? భ॥ 33

సీ॥ చంద్రునిఁ దలఁదాల్చి సర్పహారమువైచి
మూఁడు కన్నులతోడ మురియు వాఁడు
గంగను తలదాల్చి గౌరిని జేఁబట్టి
విషము మ్రింగిన యట్టి వెఱ్ఱివాఁడు
పులిచర్మమును గప్పి బూచుల దరిఁజేర్చి
యెద్దుపై నెక్కుచు నేగువాఁడు
కైలాసమున ముద్దుగణపతితోఁగూడి
నటనంబు లొనరించు నాట్యగాఁడు

గీ॥ బుడబుడక్కల వేసంబుఁ బూనువాఁడు
యోయగముగ, శ్మశానముల్ చుట్టువాఁడు
ఈశ్వరుడు ; వానినూహింప నెవరితరము ? భ॥ 34

సీ॥ తలయందు నెలవంక - వలకేల నొకజింక
నొకవంక శితశూల మొప్పు హరుఁడ !
గళనాళమునఁగందు - గణజాలముల చిందుఁ
గమ్మని సుధవిందు గలుగు భవుఁడ !
తలపైనఁ జడలేరు - తలలు గ్రుచ్చిన పేరు
తతఫాల శిఖిలీరు దాల్చుశివుఁడ !
మెడను బుస్సులరోత - మేన బూడిదపూత
విసపుమేతఁ గుడుచు వెఱ్ఱితాత !

గీ॥ పార్వతీనాథ ! నటరాజ ! ఫణివిభూష !
ధణధణధ్వనితో - భూతగణముమెచ్చ
నాట్యమొనరింపు జూతు; విన్నాణముగను భ॥ 35

నందీశ్వరుండు, నిన్నొందిక సేవింప
నెంసికొంట - భవుండ! నెలకొన్నావు
భృంగీశ్వరుండు, హారంగుతో సేవింప
ఫణిభూషణా! మెచ్చిఁబరగినావు
చండీశ్వరుండు, నీ చరణముల్ సేవింప
పార్వతీధవ! నీవు బరగినావు
కుంభోదరుండు నిన్నుఁ గూర్మితో సేవింప
గంగాధరా! నీవు గ్రాలినావు

వీరభద్రాది భైరవుల్ గారవింప
కొలుచుచున్నావు నటరాజ! గొప్పగాను
స్తోత్రముల కబ్బిపోయెదు మదితనాశ! భ. 36

ప్రకృతి విశ్వంబెల్ల బ్రహ్మదేవుని సృష్టి
యంచార్యులరసి, వచించినారు
సంరక్షణంబు, విచారించి విష్ణుండు
జేయునటంచును జెప్పినారు
పార్వతీ నాథుండు ప్రాణుల జీవముల్
పాయఁజేయు నటంచుఁబల్కినారు
ఆత్రిమూర్త్యాత్మకుండౌచుఁ దానొక్కఁడే
వెలుఁగొందు నంచును బలికినారు

ఏదితథ్యంబు? మిథ్యయిందేది దేవ!
పలుకుచున్నారు వివిధభావములతోడ
నీదు కలరూపు నెవరు వర్ణింపఁగలరు? భ॥ 37

సీ॥ కుసుమములఁదిని పెద్ద కడుపు చూపెడివాఁడు
మూషకం బెక్కుచు మురియువాఁడు
కొబ్బరికాయలఁగోరి మెక్కెడివాఁడు
గజవక్త్రమునఁగ్రాలఁగల్గువాఁడు
పాఁప జందెంబులఁబరఁగఁదాల్చినవాఁడు
చేఁతల నన్నింటిఁ జెఱుపు వాఁడు
మ్రొక్కువారలకెల్ల ముదము గూర్చెడువాఁడు
గఱిక పూజలచేతఁ గ్రాలువాఁడు

గీ॥ పార్వతీ గంగలకు ముద్దువచ్చువాఁడు
సర్వులకు ముందె తాను బూజలందుఁగొనియె
దీనియర్థ మదేదియో తెలుపుమయ్య? భ॥

మత్స్యావతారము

సీ॥ బ్రహ్మదేవుఁడు, దివారాత్రముల్ పనిఁజేసి
యలసి, నిద్దురఁజెందు నవసరమున
అసుర, హయగ్రీవుఁడరుదెంచి. నాల్గువే
దముల, హరించి, మోదమునఁబాఱి
సంద్రంబులోఁజొచ్చి సాహసికుండైన
వానిని బోరిగోన వసుధలోన
మత్స్యరూపముదాల్చి మహిమతో విహరించి
దానవుఁజంపి, వేదములఁదెచ్చి

గీ॥ నలువ కర్పించి యతని మన్ననలఁగాంచి
వేద విజ్ఞాన ముర్విలో వెలయఁజేసి
వినుత సత్కీర్తిఁగాంచిన వేదవేద్య! భ॥

## కూర్మావతారము

పాలమున్నీటిని లీలతో జిలుకంగ
  దేవదానవులెల్ల దివిరి, మంథ
రనగంబు కవ్వంబుగను, వాసుకిని దారి
  గాఁజేసి, మథియింపఁగా బ్రయత్న
మొనరింప, మంథర పర్వతంబబ్ధిలో
  మునుఁగంగ, నీవు సమ్మోదమలర
కూర్మరూపమువాల్చి కుధరంబు వీపుపై
  నిల్పితి ; వారిరాశి నిశ్చలముగ
సంద్రమును మథియింపఁగా జననమయ్యె
నమృతి ; మద్దాని దివిజుల కందఁజేసి
మోహవార్ధి రాక్షసులను ముంచినావు భ॥ 40

## వరహావతారము

కనకాక్షుఁడనెడు రాక్షసుఁడెంత బలవంతుఁ
  డయ్యెనో! తెలుపనూహలకందరమె ?
భూగోళమును జంకఁబుట్టికఁ బెట్టిలీలఁ
  బెట్టి, రసాతల మట్టె చొచ్చి
సంద్రంబులోఁ జొచ్చి, సాధుహింసకుఁడైన
  ఆదివరాహుండవై, జనించి
యద్దానవుని, హిరణ్యాక్షుని వధియించి
  కోరలపైన, భూగోళమెల్ల
మోసికొనివచ్చి, స్వస్థానమునను నిల్పి

సాధుసజ్జనాళికిని, బ్రశాంతమొసఁగి
భూతగణములఁబ్రోచిన పుణ్యపురుష ! భ॥

## శ్రీ నృసింహావతారము

సీ॥ బ్రహ్మయిచ్చిన వరప్రాభవశక్తిచే
గర్వించి, జగముఁజీకాకు పఱచి
నీమభక్తుండైన నిర్మలుఁబ్రహ్లాదు
ముద్దుకొమారుని బెద్దగాఁగ
ద్వేషించి శిక్షించి విషముఁబెట్టించియు
నాహిరణ్యకశిపుఁ డనుగుపుత్రుఁ
జీల్చమిఁ గ్రుద్ధుఁడై 'యేడేడి మాధవుఁ
డెందున్నఁజంపెద మందబుద్ధి'

గీ॥ నన్న 'నెందెందు వెదక నందందె గలఁడు
చూడు మీ స్తంభమం' దన్నఁజోద్యముగను
నారసింహావతారుఁడై నావు; దేవ ! భ॥

## శ్రీ వామనావతారము

సీ॥ వడుగువేషముతోడ - పిడుగురోషముతోడ
బుడబుడ నడకల పొలుపుతోడ
పొట్టిరూపముతోడ - బలువు తెన్నులతోడ
ముసిముసి నవ్వులమోముతోడ
చెలువు కన్నులతోడ - బలువు తెన్నులతోడ
కపట నాటకమూడు కాంక్షతోడ

శిష్టరక్షణతోడ - దుష్టశిక్షణతోడ
ప్రార్ణమై నెగడెడి బుద్ధితోడ
బలిని జేరి, మూడడుగుల వసుధఁగోరి
అతని నతలంబునకుఁ ద్రొక్కి-యమ్మహేంద్రు
వైభవము గాచినట్టి శ్రీ వామనుఁడవు! భ॥ 43

## శ్రీ పరశురామావతారము

సీ॥ హోమధేనువును, గర్వోన్నతిచేఁగొన్న
కార్తవీర్యుని యముకడకంపి
జమదగ్ని నలుకఁజేఁ జంపిన, యాతని
కొడుకుల బదివేల మడియఁజేసి
పరశువుఁజేఁబూని, పౌరుషమేపార
ముయ్యేడు మారులు పుడమిఁజుట్టి
క్షాత్రతేజంబెల్ల క్షారాబ్ధిలోముంచి
బ్రహ్మతేజస్స్ఫూర్తి బరిఢవిల్లి
గీ॥ జనని నన్నలఁ జంపితి జనకునాజ్ఞ
వారివెండియు బ్రతికింప వరముగొంటి
పౌరుష పరాక్రమోపేత! పరశురామ! భ॥ 44

## శ్రీ రామావతారము

సీ॥ శ్రీరాముఁడనబుట్టి సీతనుఁ బెండ్లాడి
సమనాలుగేడులు వనములందు
సంచారమొనరించి శత్రులఁ జెండాడి
సతిని గోల్పోయి విచారమొంది

వాలిని వధియించి, లీల సుగ్రీవు, సా
యంబునఁ గపుల సైన్యంబు నడపి
వారిధిఁగట్టి, లంకారాజ్యమును జేరి
పలురక్కసుల మిత్తిపాలుజేసి

గీ॥ రావణాసురు వధియించి రణమునందు
సీత నగ్నిప్రవేశంబుఁజేయఁజేసి
యవల నామెను గైకొన్న యట్టిదేవ! భ॥

## శ్రీ రామకృష్ణావతారము

సీ॥ గోపాలకుండవై గొల్లలతోఁగూడి
వెన్నముద్దల మ్రింగి వెలసినావు
శకట బకాదుల సంహార మొనరించి
స్వైరవిహారంబు సలిపినావు
గోవర్ధనము నెత్తి గోవుల రక్షించి
కాళీయు మర్దించి గ్రాలినావు
విజయు స్నేహితుఁడవై - విజయంబుఁ జేకూర్చి
పంచపాండవులఁగాపాడినావు

గీ॥ ప్రియముతో, బలరాముని వెంట నంటి
తిరిగినాఁడవు; గోపికాస్త్రీలతోడ
నాడి పాడితి; రామకృష్ణావతార! భ॥

## బౌద్ధావతారము

సీ॥ దితి పుత్రు లుద్ధతు లతికామలోలాత్ము
లన్యాయపరు లవిద్యవెలయంగ

వేద బాహ్యాంబవివేకమతంబైన
పాషండ మతము, సంభావనంబు
చేసి, సూనృతమునురోసి, భేదాచార
పరులయి సాధుసంపన్నులకును
కష్టముల్ బెట్టంగ - గమలాక్ష ! బుద్ధాకృ
తినిదాల్చి దానవ జనులజంపి

గీ॥ ధర్మరక్షణ మొనరించి దనరినావు !
వేదమతమును నిల్పిన వేదవేద్య !
శిష్టజనవంద్య ! గోవింద ! శ్రీవిలాస ! భ॥ 47

## శ్రీ కల్క్యవతారము

సీ॥ శిష్టుల రక్షింప దుష్టుల శిక్షింపఁ
గ్రమశిక్ష జగమునఁగ్రాలఁజేయ
న్యాయంబుఁబెంప, నన్యాయంబు సమయింపఁ
జిత్తవికాసంబుఁ జెందఁజేయ
ధర్మంబుఁబెంప, నధర్మంబుఁద్రుంప, వి
జ్ఞాన వికాసంబుఁ గల్గఁజేయ
సత్తువెల్గింప, యసత్తును కలఁగింప
శాంతి సంస్థాపన జగతిఁజేయ

గీ॥ వచ్చెదవు నీవు ఘోటక వాహనమున
గలి యుగాంతంబునందు సంకటము మాన్పి
ధారుణిని బ్రోవఁ గల్క్యవతారమూర్తి ! భ॥ 48

సీ॥ ఏకస్వరూపమై లోకేశ్వరుండుండుఁ
దథ్యస్వరూపమే మిథ్యయగును
అద్వైత మాపరమాత్మ, జీవాత్మతోఁ
గలసిపోవు నటంచుఁ దెలియఁ బలికె
జ్ఞానమార్గముతోడఁ బూని మోక్షంబును
సాధింప నగునని చాటిచెప్పె
జీవులలోనెల్లఁ జెలఁగుచు నీవుండు
వంచు విజ్ఞానియై యరసి పలికె
గీ॥ శంకరాచార్యుఁ డతుల విచారమతిని
నిన్ను నద్వైతబుద్ధి మన్నించి భక్తి
ధ్యానసిద్ధినిఁ గాంచె సంతసముతోడ భ॥ 49

సీ॥ జీవాత్మయొక్కటే జీవరాసుల వెల్గుఁ
బరమాత్మ వేరుగా బరగుచుండు
జీవాత్మ పరమాత్మ చింతించి తర్కింప
వేఱువేఱగుచును వెలయుచుండు
ద్వైతమేగాక యద్వైతమార్గము సున్న
రెండుగాకున్న నొక్కండు లేదు
జ్ఞానంబునకుఁ దోడుగా నిర్మలపుభక్తి
కల్గకుండినను మోక్షంబు సున్న
గీ॥ మంచిచెడ్డలు జ్ఞానంబు మందబుద్ధి
వెలుఁగు జీకట్లవలె ధాత్రి వెలయుచుండు
నంచుఁ జెప్పె మధ్వాచార్యుఁ డతులభక్తి భ॥ 50

పురుషుండు స్త్రీ యని పుణ్యపాపము లని
  పెద్ద పిన్న లటంచు భేదముండు
ప్రకృతిలో పగలును రాత్రి కల్పడుచుండు
  శీతోష్ణగతులని చెప్పుచుందు
సంతోష మూవల సంకటంబును వచ్చు
  వివిధంబు లెంకయి వెలయుచుండు
అద్వైత మది యున్న యంతయు ద్వైతంబు
  అంత్యకాలమున జీవాత్మ వెడలి
కర్మఫలముఁ బరమాత్మఁ గలిసి మోక్ష
మారయును; విశిష్టాద్వైత మంచు దీనిఁ
బలికె రామానుజాచార్యవర్యుఁ డెలమి భ॥ 51

ముగురాచార్యులు మూడు మతంబులఁ
  బలికిరి వాదోపవాదములను
చేసిరి తమవాక్యసిద్ధినిఁ బొందఁగఁ
  గానిఁ ముప్పాయలు కలియలేదు;
మూర్తిత్రయంబుగాఁ గీర్తి పొందిన నీకు
  మూడుమతంబులు వేరు కేమొ?
ముత్రోవద్రిమ్మరి మొగ్గదే సాగర
  సంగమంబును వాంఛసలిపి తాను

అట్లుగానెంచి తమతోచినట్టిమతము
తోడ భక్తి సేవించుటే దొడ్డగాక
మతవిదూషణ సాఫల్యమార్గమగునె? భ॥ 52

సీ॥ బంగారు మొక్కటే రంగారుభూషణ
విశతి వేలకువేలు వెలయుచుండు
జ్యోతిస్స్వరూపంబు యోజింప నొక్కటే
కిరణజాలము లెన్నొ పరగుచుండు
శుద్ధోదకం బొండె చూచుట కెన్నియో
నీటిరూపంబుల నెగడుచుండు
భక్తియు నొక్కటే పరగ భక్తులు నిన్ను
గోటిమార్గంబులఁగొలుచుచుండ్రు

గీ॥ కాని నిశ్చలభక్తి నిష్కామభక్తి
తో, యథాశక్తి నీసేవఁ జేయువారు
ముక్తిఁ బొందరె యుగయుగంబులఁ దలంప ? భ॥ 53

సీ॥ సాకారుఁడంచు, నిరాకారుఁడంచును
సగుణ నిర్గుణుఁడంచు, సదయుఁడంచు,
నిత్యుండటంచు, ననిత్యుఁడటంచు, ని
ర్నాముండటంచు ననాముఁడంచు
అన్నింటఁగలఁడంచు నన్నింట లేఁడంచు
సంసారియని, యసంసారియంచు,
ఒంటివాఁడనియంచు, జంటకల్గునటంచు
భోగియంచు, మఱియు జోగియంచు

గీ॥ తథ్యమిథ్యాస్వరూప వాదములఁబెంచి
ద్వైత మద్వైత మనెడు, తత్త్వములఁబెంచి
పలుకుచున్నారు నిన్ను తాత్పర్యమేమి ? భ॥ 54

సీ॥ పంచాక్షరీమంత్ర పఠనంబు శివుని, స
న్నిధిఁ జేర్చు నంచు వర్ణించినారు
శ్రీరామనామంబు చింతింపఁగా ముక్తి
తెచ్చిపెట్టు నటంచుఁ జెప్పినారు
ఏసునుఁ గీర్తింప వాసిగా మోక్షంబు
ప్రాప్తించు నని పాటఁబాడినారు
'అల్లా' నమాజుఁ జేయంగ కైవల్యంబు
సిద్ధించు నంచును జెప్పినారు

తే॥ విగ్రహారాధనము మానివేసి ప్రకృతి
నతులముగఁ గీర్తనము సేయు టదియె సిద్ధి
యని, వచింత్రు కొందఱు దీని యర్థమేమి? భ॥ 55

సీ॥ కామంబు తోడుతఁ గాంతలఁ జేపట్టి
క్రోధంబుతోఁ జాల కొట్టులాడి
లోభంబునకులోగి లోఁజేర్చి ద్రవ్యంబు
మోహావశంబున ముగ్ధుఁ డగుచు
ధనధాన్య వస్తువాహనములు జేర, మ
దంబునఁ దన్నుఁ దా డంబుమీఱ
స్తుతియించు కొంచు, సంతతము స్వైరవిహార
లోలుఁడై తిరుగుచు లోకమందు,

తే॥ జనుఁడు మాత్సర్యవశమునఁ జలముబట్టి
చేయరాని, యకృత్యముల్ సేయుచుండు
వీని గెలిచిన వాఁడె విజ్ఞాని మాని, భ॥ 56

సీ॥ మానసంబును నిల్పి మానిక క్షణమైన
పరమేశు ధ్యానింప వలయుఁ గాక
బుద్ధి నేకడలకుఁ బోనీక నిమిషంబు
పరమాత్ముఁ జింతింప వలయుఁ గాక
నిశ్చల నియతిచే నిత్య మొక్కగడియ
పద్మాక్షుఁ దలపంగ వలయు గాక
ఏకైక నిష్ఠచే లోకైకమూర్తిని
చింతన సేయగాఁ జెల్లుగాక

గీ॥ ముక్కుబిగబెట్టి కూర్చుండి టక్కుజపము
పరులు జూచుటకై చేయు ప్రజల కెందు
ముక్తి కల్గునె కామవిరక్తి లేక ? భ॥

సీ॥ సూర్యచంద్రులలోనఁ జూపట్టెదవు నీవు!
సామవేదములోని సారమీవు !
ఓంకారమేనీవు ! శంకరుండవు నీవు !
షణ్ముఖుండను మేటి స్వామి వీవు !
పావకుండవు నీవు ! వాసవుండవు నీవు !
జపయజ్ఞమే నీవు ! జముఁడ వీవు !
ప్రహ్లాదుఁడవు నీవు ! రామచంద్రుఁడ వీవు!
వైనతేయుఁడ వీవు ! వ్యాసుఁడీవు !

గీ॥ అక్షయుఁడ వీవు ! ఆదిమధ్యాంత రహిత !
చిత్రరథుఁడవు నీవు ! గాయత్రి వీవు !
ఈ రహస్యంబు గీత వర్ణించు చుండు ; భ॥

సీ॥ సీతాచలమవీవు! శీర్ష సహస్రముల్,
చెలఁగు భోగివి నీవు సింహమీవు!
ద్వంద్వమూర్తి సకార వర్ణంబు నీవు! వా
గ్ధృతి వీవు! తలపఁగా స్మృతియు నీవు!
వాసుదేవుఁడ వీవు! వాసుకియును నీవు!
భృగుమహర్షి వి నీవు! బీజమీవు!
మార్గశిరము నీవు! మకరమూర్తివి నీవు!
రాజచక్రము నేలు రాజ వీవు!

గీ॥ కపిలముని వీవు! వరుణుఁడై గ్రాలుదీవు!
మానసగుణ మీవు! యోచింప జ్ఞానమీవు!
ఎల్లకళలందు సౌందర్య మీవు గావె! భ॥ 59॥

సీ॥ రాజనీతులలోన రంజిల్లుచుందువు,
దండనీతిని నీవు దనరినావు
మేరుశిఖరమందు మెలఁగుచు నుందువు,
గురుఁడవై కార్యముల్ గూర్చినావు
నాగరంబున నీవు సంచార మొనరింతు
వశ్వత్థమున నీవు నలరినావు
మానసవీథిలో మలయాడు చుందువు,
నారదుండై నీవు నటనఁజేతు

గీ॥ వనసి జన్మంబు మృత్యువు నరయ నీవు!
కామధేనువు నీవు! సత్కామ మీవు!
గీతయే నీవు విమల సంగీతమీవు! భ॥ 60

సీ॥ జాహ్నవీ జలముల సంచార మొనరింతు
వధ్యాత్మ విద్యలో నాడుచుందు
వలకాధి పతివిగా యశము గొన్నాఁడవు;
కామధేనువుగాఁగ గ్రాలినావు
ఐరావతంబవై - యాధిక్యమును గొంటి
వర్యముండనఁ గీర్తినందినావు ;
ఉచ్చై ఃశ్శ్రవంబవై యున్నతస్థితినుంటి
వర్జునుండయి, మేటి యశముపొంది

గీ॥ నావు ; శుక్రుండవై నావు దేవ ! నీవు
ఋతువులందు, వసంతమై - నుతినిగన్న
భవ్యమైన తేజోమూర్తి ! పంకజాక్ష ! భ॥ 61

సీ॥ రామతారకమంత్ర రాజంబు తొంబది
యాఱుకోట్లు జపంబు నధికభక్తి
నొనరించి నిన్నుఁగాంచెను ; త్యాగరాజెంత
మహిమోన్నతుండో ? నీ మహిమందాను
స్తుతియింప నయ్యెవి కృతులుగా వెలువడె
భక్తిప్రపూర్ణ భావంబుతోడ
తుంబురు నారద తుల్యుఁడై గాన, వి
ద్యా విశారదుఁడయి తనరినాఁడు

గీ॥ జ్ఞానవైరాగ్యముల, వ్యాసహాని సముఁడు
భక్తియందున హనుమంతుఁ బరగమించె ;
నిట్టి త్యాగయ్య భక్తి నాకిమ్ము దేవ ? భ॥ 62

సీ॥ భార్యమాతాదేవిపై - కామవశమున
బుద్ధి జాడ్యుండయి పోయి, కాల
సర్పంబుపై నుండి జాటియు, ప్రేలాడి
యుండ, రజ్జని పట్టి, నూర్ధ్వభాగ
మున కేగి, సుఖనిద్ర మునింగిన సతిం జేరి
వచ్చిన విధము వాక్రుచ్చినంత
భార్యయాశ్చర్య సంభరిత చిత్తముతో సఃం
గలంగి తన్నూచి మేల్దెలివిగల్గు

గీ॥ నట్లు హితబోధ లొనరించ నప్పుడె దా, ప్ర
బోధితుండయి, వనిం జేరి పూర్ణభక్తిం
దలంచి నిను, ముక్తిం జెందెను ; తులసిదాసు భ॥ 63

సీ॥ నీమీందిధ్యానంబె నెమ్మనంబున నుంట
వలువను నేయం దాం దలంపడయ్యె
భక్తునిభావంబు బాగుగాం దలపోసి
దయచేసి నేసి వస్త్రము ముగించి
యావస్త్రమును నమ్మ నంగడి వీథికి
వేగంబంపితివి ; కబీరుదాసు
వలువను గొనక్రై రి విలువ యెక్కువటంచు
దానిని చించి, బీదల కొసంగె ;

గీ॥ భక్తుపై గొండెములం జెప్పి పాశ్రకటముగ
శిక్ష నిప్పించి, యాశిక్షం జెంది నీవు
దర్శన మొసంగితి ; కబీరుదాసునకును భ॥ 64

సీ॥ ‘భక్త! శిష్యుండ! శివాజీ మహారాజ!
గర్వంబుఁజెందకు ఘనుఁడనేని
కూలీలఁబోషింతుఁగుడువ నిచ్చెదనంచు
దంభంబు వలదు; సత్యంబు సుమ్ము
జాతిలోఁగప్పకుఁ బ్రాణమెవ్వఁడొసంగె?
నీర మచ్చటికెట్లు జేరఁగల్గెఁ
జూడుమా’ యని రాతి వేదుకఁబగులఁగొ
ట్టించి, మండూకంబుఁ గాంచఁజేసి
గీ॥ నీదు యద్భుత లీల సునిశ్చితముగ
బోధఁజేసె సమర్థుండు; పొలుపుగా, శి
వాజి, నీభక్తుఁడయ్యెను; పంకజాక్ష! భ॥ 65

సీ॥ బొక్కసంబున నున్న రొక్కంబు నంతయు
వ్యయమొనరించి దేవళము గట్టి
అధికార కర్తవ్య మరయక నేప్రొద్దు
నీ నామ చింతన నిత్యమనుచు
భజియించు గోపన్న నిజభక్తి నెఱుఁగక
సర్కారు ద్రవ్యంబుఁజాల దిసియె
నని, చెఱసాలలో నునుపఁగా భూభర్త
రాత్రింబవళ్ళు; ‘శ్రీరామరామ’
గీ॥ యంచు, ధ్యానించి కీర్తింప హర్ష మలర
రామచంద్ర! ప్రత్యక్షమై, రామదాసు
రక్షణమొనర్చి నాఁడవు రక్తితోడ భ॥ 66

సీ॥ నయగుణశాలి 'ఆనందాశ్రమ' నివాసి
 రామదాసస్వామి ప్రేమ మయుఁడు ;
ఈ ప్రపంచంబెల్ల - నీశ్వరమూర్తిగా
 భావించునట్టి సద్భక్తిపరుఁడు
చింతించు నెపుడు 'ఓం - శ్రీరామ జయరామ
 జయ జయ రామ్మ'ను శబ్దరాజ
మీ మంత్రమే జగ - మెల్లఁదిరిగి, బోధ
 న మొనర్చె ; మనమున నమ్మినట్టి

ఆ॥ దైవమూర్తిని ధ్యానింప దగునటంచు
రామదాసు బోధించెను ప్రేమతోడ
పల్కుచున్నావు భక్తుల భావమందు ; భ॥ 67

సీ॥ హాలికుఁడై - భక్తుడై - భాగవతమును
 రచియించెఁ బోతన్న రక్తితోడ
వాణి, మంజులవేణి, స్వాధీన మాయె : వీ
 ణారవంబులతోడ నాదమొసఁగె ;
శ్రీనాథుఁడతి బలశ్రీఁగల్గి, శిష్య స
 మేతుఁడై, రాగ సంప్రీతితోడ
భారతి వడ్డించెఁ బంచభక్ష్యములు, శ్రీ
 నాథ ! నీ కరుణ యున్నన్నరునకుఁ

గీ॥ దక్కు వేమిటఁగల్గు ? పోతన్న భక్తిఁ
గాంచి ప్రత్యక్షమైనావు కమలనయన !
అట్టి సద్భక్తి నాకిమ్ము హరి ! ముకుంద ! భ॥ 68

సీ॥ పిల్లికిఁ బిచ్చంబుఁ బెట్టనేరని లోభి
యాచకులను ద్రిప్పఁజూచువాని
దాసు, పురందరు - ధన్యుఁజేయగ, బీద
విప్రుని వేషంబు వేసివచ్చి
యాచించి, గొప్పగా నవమాన మొందితి
వామీఁద సతనిభార్య దయతోడ
ముక్తి నీకిచ్చె ; మురహర ! గోవింద !
యంతఁ బురందరుఁ డతివఁగాంచి

గీ॥ ముక్తిను, చూపుమన్న నా పొలఁతి నిన్ను
భక్తి ధ్యానింప ముక్తి వచ్చెనంత
భక్తుఁడయ్యెఁబురందర ప్రముఖవరుఁడు ; భ॥ 69

సీ॥ అరుణాచలక్షేత్ర మరుదారఁ బదునేడు
వత్సరంబుల నాఁడె పరగఁజేరి
సిద్ధి పొందెడుదాఁకఁ జేసెను ఘోరతపా
శ్రమము, నిశ్చలభక్తి తత్త్వమొంది
క్రిమికీటకాళి దేహముఁజేరి బాధింప
నించుకేనియుఁ జలియింపఁడతఁడు
హింస వర్జించి, యహింసను జేపట్టి
ప్రేమ ప్రభావంబుఁ బ్రీతిఁదెలిపి

గీ॥ రష్యనుల, నాంగిలేయుల రక్తితోడ
శిష్యులను గాఁగఁజేసి ప్రసిద్ధివడసె
రమణ ఋషివర్యుఁడిది నీదు ప్రతిభ కాదె ? భ॥ 70

సీ॥ 'సత్యస్వరూపుండు, సర్వేశ్వరుండు, ది
వ్యత్వంబు ప్రతివస్తు వందు నుండఁ
బ్రేమయే దేవుండు ; ప్రేమింపఁదగిన, వ
స్తువు, దేవుఁడే సుమ్ము క్షోణియందు ;
ధర్మంబు రక్షింపఁ ద్యజియించు దేహంబు
నెవ్వాఁడు ? నతఁడె యోగీశ్వరుండు ;
పూజ్యపాదుఁడతండు - పూజ్యత సిద్ధింప
దివ్యత్వమునుజెంది తేజరిల్లు ;

గీ॥ ధరణి, దివ్యత్వమందు నతండె దేవుఁ
డంచు,' రామతీర్థస్వామి మించుభక్తిఁ
బలికె, దివ్యత్వ మెఱిఁగెడి పథమదెద్ది ? భ॥ 71

సీ॥ దక్షిణేశ్వరమునఁ దద్దయు భక్తితోఁ
కాళికోపాసన కడఁకఁజేసి
వేంచేయు భక్తుల ప్రియమునఁగాంచి, ని
త్యానంద పూర్ణచిత్తమున 'జగము
మిథ్య యీశ్వరసేవ తథ్య' మంచును బల్కి-
సహధర్మచారిణి శారదాంబ
శ్రద్ధదీప్తిఁబతివార్య ! ముద్దుగాఁబ్రియురాలి
యాకారమున జగదంబఁగాంచి

గీ॥ భక్తినారాధన మొనర్చి పరగినావు
రామకృష్ణ - పరమహంస ! ప్రణుతిఁజేతు ;
నింపుగా నీదులీల వర్ణింపఁదరమె ? భ॥ 72

సీ॥ ప్రాఁటలు గడుపంగ బూటకవేషముల్
దాల్తురు ; యోగులై ధరణి జనుల
వంచింత్రు ; దేవుని వాంఛతోఁ గన్గొన్న
వారలు లేరను భావమునను
శ్రీ వివేకానంద సిద్ధుఁడు, శ్రీరామ
కృష్ణపరమహంస విష్ణుభక్తుఁ
జేరి 'ఓస్వామి ! చూచితిరె దేవుని మీర'
టంచుఁబల్కిన 'రమ్ము - కాంచినాఁడ

గీ॥ నేనుఁగూడఁ జూపెదనంచు - నెమ్మితోడ
శీర్షమును దువ్వి, తేజోవిశేష మొందు
స్వామిజీ నాశ్రయించి, సద్భక్తుఁడయ్యె ; భ॥ 73

సీ॥ పద్మావతీ సతి పదనాట్యములు దొక్క
'గీత గోవిందంబు' నాతతముగ
పాడిన జయదేవ వరమహా సుకవి, నీ
భక్తవరేణ్యుఁడై పంకజాక్ష !
మహిఁగీర్తిఁగాంచె ; పద్మావతీ చరణ చా
రణ చక్రవర్తి' యనఁగ రక్తితోడ
శ్రీకృష్ణ ! కావ్యరసికులు మెచ్చంగ నీ
శృంగార గీతంబు రంగుగాఁగ

గీ॥ భార్యతోఁ గూడి పాడిన భాగవతుఁడు
యతని సంగీత మాలించి హర్ష మొంది
నటనఁజేసిన శృంగార నటకుఁడీవు ! భ॥ 74

ప్రకృతి సౌందర్య ముపాసించి, కవితార
  చన మొనర్చిన యట్టిసరసమూర్తి
శ్రీ హిమాలయ యాత్రఁజేసి, చల్లని కమ్మ
  తెమ్మెరల్, సెలయేళ్లు దివ్యముగ, హి
మావృత శిఖరంబు లవలోకన మొనర్చి
  ప్రాభాత గీతముల్ ప్రకట పఱచి
వ్రాసి గీతాంజలి బహుమానమును పొంది
  విశ్వభారతి సంస్థ వెలయఁజేసి
సకలదేశ సంస్కృతులందుఁ జక్కగాను
బోధ లొనరింపఁజేసిన బుధవరుండు
విశ్వకవి నీదు కృపచేత వినుతికెక్కె ; భ॥ 75

కరమర్థి నెదురేగి పరిరంభణ మొనర్చి
  బాంధవ ప్రీతిని బాదుకొల్పి
అనువుగాఁదల్పమందాసీనునిగఁజేసి
  బంగారు చెంబుతో వారిఁదెచ్చి
కాళ్ళుల భక్తితోఁగడిగి, తజ్జలముల
  నీదుశీర్షము నందు నెమ్మిఁదాల్చి
మృగనాభి, కర్పూర మిళితమై యొప్పు, చం
  దనము, కుచేలుని తనువునందుఁ

బూసి, తాళవృంతముతోడ మోదమలర
విసరినాడవు ! శ్రీ దేవ ! వేదవేద్య !
నీదు నెయ్యంబు తీపు వర్ణింపఁదరమె ? భ॥ 76

సీ॥ జీర్ణాంబరునిఁజేరి, సిగముడిలోఁబుష్ప
  మాలికలఁదుఱిమి, మమతతోడఁ
గర్పూర తాంబూల మర్పించి, గోదాన
  మిచ్చి, స్వాగతమిచ్చు సచ్చరిత్ర!
శ్రీ కృష్ణ! నినుఁబోలు స్నేహితులుందెరె? కు
  చేలుని పుణ్యంబుఁ జెప్పఁదరమె?
కమలాక్షి రుక్మిణి కరకంకణ రవంబు
  చెలఁగఁజామరము, వేసినది భళిరె!

గీ॥ అక్కుచేలుఁడారాత్రి, మృష్టాన్నభోజ
నంబు, మృదుశయ్య నిద్ర నానందముసను
బొందె; నీదు వాత్సల్యంబు బొగడఁదరమె? భ॥

సీ॥ ' దళమైననుఁబూవైన ఫలమైన నీరైన
  భక్తులొసంగ, నాసక్తితోడఁ
గుడుతు; దుష్టాత్ముండు గొండంతఁబెట్టినఁ
  గుడువఁజాల ' నటంచుఁ గూర్మిపలికి
యక్కుచేలుఁడు, జీర్ణాంబరంబున భక్తి
  ముడిచి, తెచ్చిన కొన్ని యడుకులట్టె
పిడికెఁడు గొనివానిఁ బ్రియమున భక్షించి
  శ్రీ కృష్ణ! తృప్తుఁడై చెలగినావు

గీ॥ నీదు తృప్తి, యష్టైశ్వర్య నిధినొసంగె
నక్కుచేలుని కతని భాగ్యంబు పరుల
కబ్బునే? కృష్ణ! శ్రీపతీ! అబ్జనాభ! భ॥

సీ॥ దిక్కుంభి యూథంబుఁ దెప్పించి త్రొక్కించె
నుగ్రానలములోన - నుదధియందు
ముంచెఁ; బాములఁగఱపించె; విషము పెట్టె;
నొకసారి రంధ్రంబు లుక్కఁబెట్టె;
బాలుఁ బ్రహ్లాదుని బలుబాములన్నిట్టి;
కనక కశిపుఁడింత కనికరంబు
లేకఁ, దనదుసుతుండేక నిష్ఠతోనున్న
కారణమునఁ జంపగా, మఱెన్నొ

గీ॥ మారణక్రియలొనరించె; శ్రీరమేశ!
ఒత్తమందుఁ బ్రహ్లాదుండు జేర్చె నిన్ను :
భక్తులకు కష్టమెట్లు సంప్రాప్తమగును? భ॥ 78

సీ॥ వన ఫల పారణ వ్రతుఁడయి మాసంబు
నిన్నుఁబూజించెను నిష్ఠతోడ
కృతజీర్ణ తృణపర్ణ మిత భోజనుండయి
నిన్ను నారాధించె నెలదినంబు
లుదక భక్షణతోడ నుండె మూడవమాస
మనిల భక్షణ తోడ నెలదినంబు
లతుల జితశ్వాసుఁడై నిన్ను భజియించె;
నంత, నిరుచ్ఛ్వాసుఁడై - ధ్రువుండు

గీ॥ యేకపదమున నిల్చి, తదేకనిష్ఠఁ
దపము సేయ, ముల్లోకముల్ తాపమొందె;
నహాహా! ధ్రువబాలకుని భక్తి నభినుతింతు: భ॥ 79

సీ॥ భీషణగ్రాహంబు పెనురోషమున, గజేం
ద్రుని పాదములఁబట్టి దోర్బలమున
ఘీంకారమొనరించి, కేలెత్తి చఱచి, ప
దంబులఁ బైకెత్తి దర్పమడర
వెయ్యి వత్సరములు గయ్యంబొనర్చె, లా
వెల్లసమసె, ధైర్యమెల్ల వెడలె ;
డస్సె, శ్రమంబాయె, డగ్గఱె మృత్యువు
గ్రాహంబు విడువకఁ గష్టమిడియె ;
గీ॥ నప్పు 'డో ! దీనబాంధవా ! హరిముకుంద' !
యంచుఁ బ్రార్థింపఁ జక్రముదంచితముగఁ
బంపి మకరేంద్రుఁ ద్రుంచిన భక్తవరద ! భ॥

సీ॥ సంచితార్థంబు, లుదంచితప్రేమ, దీ
నులకిచ్చి, కూడు నీరులఁద్యజించి
సకుటుంబుఁడై, కష్టచయముల నోర్చె ; న
ల్బది యెన్మిది దినములది - ముకుంద !
నీలీల లోకనాడు - నీరువట్టాకలి
రంతిదేవు గలంప రక్తితోడ
నాహార నీరంబు లారగించుటకునై
యుత్సహించెను ; భూసురోత్తముఁడొకఁ
గీ॥ డంత నేతెంచి యాకలి కన్నమడుగ
నిచ్చె సగమొక్క శూద్రుని కిచ్చెమఱల
సగము ; భక్తపరీక్ష - నీ సహజగుణము ! భ॥

సీ॥ ఆకలి యెక్కుడై యన్న శేషము దిన
వాంఛింపఁగుక్కల బంపినావు
రంతిదేవు బరీక్ష - భక్తప్రియా! నీకు
సంతోషమే? శ్వాన జాతికన్న
యన్నంబొసంగె; నీరైనఁ ద్రావగనెంచెఁ
గాని, చండాలు డొక్కండువచ్చి
నీరమాకాంక్షింప - నీరజాక్షా! నిన్ను
భక్తిధ్యానించి, సంభరితకరుణ

గీ॥ నీరుదానంబు మాలకు నెమ్మిఁజేసె
నంతఁ బ్రత్యక్షమైనావు రంతిదేవు
నకును; నీమాయ లెఱుఁగఁబ్రహ్మకు వశంబె? భ॥ 83

సీ॥ అంబరీషుండు, భక్తాగ్రగణ్యుండు, సం
సారంబు రోసి నీ చరణయుగము
భక్తిసేవించె; దుర్వాస మునీంద్రుండు
ద్వాదశీ పారణ మోదముగను
సలుపగా నేతెంచి జలకమాడుచు వేగ
రాడయ్యె; ద్వాదశీ వ్రతఫలంబు
చెడునంచు భూపాలకుఁడు జలపారణ
మొనరించె, నంతలో మునియు వచ్చి

గీ॥ యుగ్రుడై 'కృత్య' విడువ మహోగ్రముగను
ఋషిని వెన్నాడి చక్రంబు, రోషముడిపె;
భక్తులకు రక్షణం బీవె! పంకజాక్ష! భ॥ 84

సీ॥ బోధివృక్షము క్రింద బోధితుండయ్యెను
జ్యోతిని గాంచె విఖ్యాతముగను
హింసయేపాప, మహింసయే పుణ్యంబు
ప్రాణుల, హింసింప రాదటంచు
బోధింప, శ్రీ బుద్ధభగవానుఁ బంపితి
వా దయామూర్తికి, నరయసాటి
కలవారు లేరెందు, కరుణ గీతంబులఁ
బ్రజ మేలుకొల్పె, సంబరముతోడ

గీ॥ సకలమానవు లాతని యధికభక్తి
మమత నర్చించి రతఁడు సమత్వమూర్తి
బుద్ధదేవుని జ్యోతికి మూలమెవరు ? భ॥ 85

సీ॥ నడవడి మంచిదై - నుడి మంచిదైనను
బాగుగును జ్ఞానంబు భూమి యందు
సరియైన జ్ఞాన విచారంబు జేకూరుఁ
గర్మలు సల్పించుఁ గర్మలూహ
జిజ్ఞాస యుదయించి - చిన్మయానందుపై
బ్రబల నమ్మకమొందు బ్రబలుదాన
ముక్తిమార్గము జిక్కు- ముదితలు బురుషులు
దీనిని సతము, సాధింపుడంచు

గీ॥ వర్ధమాన మహావీరవరుఁడు, జైన
మతము స్థాపించి, శ్రీమోక్ష మార్గమనెసె ;
నిన్నుఁగనఁ జెక్కు- మార్గంబు లున్నవయ్య ! భ॥ 86

సీ॥ అజ్ఞానమున మున్గి - విజ్ఞాన లేశంబు
  లేకుండ, క్రూరులై - లీలతోడ
మనుజ లోకంశోరులను మర్దించుకొనుచు, స్వైర
  ర విహారలోలురై - రాక్షసులను
మించి, యోగడము, లుదంచితముగ, నొన
  ర్చుచుం జెట్లంబుట్టలంజూచి కొల్చు
చుండ, నరేబియా - ఖండమందు మహాత్ము
  డుదయించి, మంచి జ్ఞానోపదేశ
గీ॥ మొసంగె ; 'నల్లా' యనగ దేవుండొకండె - గాని
భక్తింజింతింప మోక్షసంప్రాప్తి కల్గు
నంచు వాకుచ్చె : నీలీల లద్భుతములు ! భ॥ 87

సీ॥ కాయ మస్థిరము, నిక్కంబని శిలువపై
  నిలిచి నావెంతటి నిశ్చలుండవో !
నిలుచుటయే కాదు - నీకరంబులంజాచి
  పర్వతస్థైర్యానం బదయుగంబు
మోపి, దైవధ్యాన మోపిక నొనరించి,
  కఠిన మేకులం గొట్టం గాయమెల్ల
గాయంబు లగుచు, రక్తప్రవాహము బాఱ
  'హాదేవ ! దీనులీ యజ్ఞు లొనర
గీ॥ నల్పు పాపకృత్యంబుల నైరణంబు
సేయుమ'ని, ప్రాణముల వీడి సిద్ధింజెంది
నావు ; ఏసుక్రీస్తు మహాత్మ - దేవపుత్ర ! భ॥ 88

సీ॥ ఎచ్చట బుట్టెనో ? యెవ్వరు పెంచిరో ?
కులగోత్రనామముల్ దెలియరావు
షర్డీ - పురముజేరెఁ జావడిలోనుండె
భిక్షాన్నమును దినె - రక్షలొసఁగె
వారిని బోసి దీపములు ముట్టించె, నిం
బ కుసుమములను, సాపాటొనర్చె
ధ్యాస సిద్ధినిగాంచె - మౌనియై జరియించె
యుపవాసములు పెక్కులుండె, రోగ

గీ॥ ములను బోకార్చె ; సంకటముల హరించెఁ
బ్రజల సేవించె ; శ్రీ సాయిబాబ నీదు
యంశ పురుషుండు గాదె ? ప్రహ్లాదవినుత ! భ॥ 89

సీ॥ రవి యస్తమింపని రాజ్యంబు గలిగిన
బ్రిటిషు సింహము గొప్ప భీతిఁజెందె
సత్యాగ్రహము, రాట్నచక్రంబు, దౌర్జన్య
రాహిత్య సిద్ధాంత మోహనాస్త్ర
మసహాయ మంత్రంబు లవనీపతుల నెల్ల
దిగ్భ్రమఁగొల్పె ; గాంధీమహాత్ముఁ
డత్యంత భక్తి యహరహంబు నిన్గూర్చి
ప్రార్థించె ; నీశక్తి రక్తిఁదెలిసె

గీ॥ మేరు ధైర్యంబు, వాక్శుద్ధి, గౌరవంబు
నిశ్చలత్వంబుఁ బొందె ; గాంధీ మహాత్ము
జయము నీశక్తిగాదొకో ? జలజనయన ! భ॥ 90

'ధ్యానజపాదులఁబూని యభ్యాసంబు
సల్పుము ; ప్రార్థనాసక్తిఁగనుము ;
పరిపూర్ణ విశ్వాస పరిణతి నంది, మ
నఃపూర్తిగాఁ బ్రార్థనం బొనర్పఁ
బ్రేమభక్తి జనించుఁ బ్రియముగ గోపిక
లద్దానిఁబొంది కృతార్థులైరి'
యని, శారదాదేవి ఘనముగా బోధించెఁ
బతిని సేవించె సంతతము భక్తి
నామె నెందఱో శిష్యులు నాశ్రయించి
రట్టి యాధ్యాత్మికంబగు హాయిఁ బొంద ;
దేవ ! నీలీల నాకుఁ జిత్రింపదరమె ? భ॥ 91

జవ్వన సౌందర్య - సంపదల్ స్థిరమని
సతము భావించెను సత్యభామ
తనదాసుఁడగుచు, నిత్యము దన్ను సేవించుఁ
దనపతి యంచును దలఁచి, రుక్మి
ణీభామ నెపుడు మన్నింపక గర్వాంధు
రాలై మెలఁగుచున్న రమణి కీవు
శ్రీతులాభారంబుచే, గర్వభంగంబు
గావించి, కనువిప్పఁగల్గినావు

భక్తిమార్గ మామెకు సులభంబుగాగ
బోధ సలిపితివో పుణ్యపురుష ! నీదు
కపట నాటక మెవ్వారు గాంచినారు ? భ॥ 92

సీ॥ 'పరిణయంబాడిన పదపడి, భర్త, వై
కుంఠంబు జేరును కువలయాక్షి
సావిత్రి! మదిలోన - సత్యవంతుని వీడి
వరియింపు వేఱొక భర్త' నన్న
'సత్యవంతుండె . మనస్సాక్షిగా నాభర్త
యంచు, నాతని వరియించి, యముని
తో - సవాలొనరించి, తోరంపు పతిభక్తి
జముని వెన్నంటె, సై సై' యనంగ

గీ॥ నతని స్తుతియించి, మన్నన లంది, వరము
లంది, భర్త ప్రాణంబుల బొందె సాధ్వి;
నిన్ను భజియించు వారల కున్నె కొదువ? భ॥

సీ॥ అత్రిమహాముని - యనుంగు కుటుంబిని
అనసూయ, సాధ్వి - మహాపతివ్ర
తాశిరోమణి; యామెందాము పరీక్షింప
శారద - శ్రీలక్ష్మి - శంభురాణి
వివిధ మాయలంబన్ని - వేసారి, తమ మగ
వారిఁబంపంగ, నవ్వారువచ్చి
వస్త్రహీనముతోడ - వడ్డింపు మన, 'నేఁ బ
తివ్రతనైన, మూర్తిత్రియంబు

గీ॥ పాపలగుదు' రటన్న - యప్పరమ పురుష
మూర్తులెల్ల శిశువులై రి ముద్దుగాగ
నదియు నీమాయ గాదొకో సదయహృదయ! భ

సీ॥ నీభక్తికంటెను నిజభర్తలను భక్తి
సేవించుటే గొప్పస్త్రీలకెల్ల
భర్తయే దైవంబు; భర్త భక్తినిఁగొల్చు
యతివల కిల, నసాధ్యంబు లేదు
మూర్తిత్రయంబల్ల ముద్దు కొమరులైరి
భారతి, కమలయుఁ బార్వతియును
అనసూయ గృహమున కరుదెంచి, పతిభిక్ష
వేఁడిరి; శ్రీశ! యీ వేడబములు

గీ॥ నీదు పన్నాగములు గావె! మోదమలర
యత్రి మునికి, దత్తాత్రేయుఁడగుచుఁబుట్టి
దంపతుల కోర్కెఁదీర్చిన ధన్యచరిత! భ॥ 95

సీ॥ ప్రారబ్ధకర్మల ఫలము దాఁగుడువంగ
జన్మమెత్తును జీవి జగతి యందు,
కర్మ లనుభవించు గతికిఁ జింతిల్లక
సంచిత కర్మ లుదంచితముగ
నార్జన మొనరించు నతిపాపములఁజేసి
ప్రాణికెప్పుడు మోక్షఫలముగల్గు
సంచిత కర్మల సముదయంబునఁజేసి
జీవి చచ్చుచుఁబుట్టి చివికి చివికి

గీ॥ మఱల నాగామి కర్మసంబంధ ఫలము
కుడువఁబోవు; జన్మకు సిద్ధి - విమగఅయును
కల్గునే? నీదు చింతన కల్గకున్న? భ॥ 96

సీ॥ ప్రథమ పుష్ప మహింసఁబడసి, రెండవపుష్ప
మింద్రియ నిగ్రహం బెలమి పొంది
భూత దయాపుష్పమును, గడియించి, క్ష
మా పుష్పమార్జించి - మహితగతిని
శాంతి పుష్పంబొందు, సంపాదన మొనర్చి
తపమను పుష్పంబుఁదాల్చి, ధ్యాన
పుష్పంబు నిష్ఠతోఁ బొందిన తర్వాత
సత్య పుష్పంబును సంగ్రహించి

గీ॥ భక్తి నీయష్ట పుష్పముల్ భద్రపఱచి
యెవఁడు నిర్వ్యాజ లొనరించు భువిని వాఁడు
జన్మసార్థక్య మందఁడే సత్యపురుష ! భ॥

సీ॥ వాఙ్మనఃక్రియలచే వనజాక్ష ! నీమైత్రి
వెలయించి నీ కథల్ వినఁగవలయు
దాసుఁడై, నమ్రుఁడై దాసత్వ మొనరించి
వందనార్చనము, లానందముగను
సల్పి, యాత్మార్పణ సంపాదన మొనర్చి
నీసేవ నిష్ఠతో నెఱప వలయు ;
నీదు సంకీర్తన నియతితోఁ గావించి
నిను సదా చింతించి మనఁగవలయుఁ

గీ॥ గడిమిఁ తొమ్మిది భక్తిమార్గములు దెలిసి
నమ్మి, సన్మార్గగామియై నెమ్మనమున
నిన్ను సేవించు వాఁడె - సంపన్నుఁడరయ ; భ॥

సీ॥ వాఙ్మనఃక్రియలచేఁ బ్రహ్లాద భక్తుండు
నీసేవ లొనరించె నీరజాక్ష!
శ్రవణ మందాసక్తి శ్రద్ధఁబరీక్షిన్మ
హారాజు, నీదు కథాళి వినియె
మతిమంతుఁడై, హనుమంతుండు, నీదు దా
సత్వ మహర్నిశల్ సలిపెభక్తి
వర మునీశ్వరులెల్ల వందనంబొనరించి
మోక్ష సామ్రాజ్యంబుఁ బొందినారు

గీ॥ త్యాగరాజు, నిన్నర్చించి ధన్యుఁడయ్యె
గోపికాస్త్రీలు, నీ సేవ కుతుకమునను
సలిపి ధన్యాత్మలైనారు జలజనయన! భ॥ 99

సీ॥ అక్రూరుఁడుద్ధవుండాత్మలో నిను సదా
యెఱిఁగి, నీ సేవను మరఁగినారు
శ్రీరామదాసు, తుకారామ భక్తుండు
నిన్నుఁగీర్తించి, వర్ణించినారు
పంచపాండవులు, ద్రౌపదియు, నిన్మనములో
సతతంబుఁ జింతల సలిపినారు
భయమునఁ గంసుండు పగతోడ శిశుపాలుఁ
డెప్పుడు నిన్గొల్చి యొప్పినారు

గీ॥ భక్తిమార్గము ల్దొమ్మిదిఁ బడయఁజాల
శక్తుడై, నిన్ను సాధింపజాలనింక
నిన్నుఁబొందెడు మార్గంబు లున్నెనాకు? భ॥ 100

సీ॥ గద్దనెక్కి-యొకొండు, యెద్దునెక్కి-యొకొండు
పులుఁగునెక్కి-యొకొండు పొలుపుగాంచు
బఱ్ఱెనెక్కి-యొకొండు - గొఱ్ఱెనెక్కి-యొకొండు
నెమిలియెక్కి-యొకొండు నెమ్మిసూపు
చిలుకనెక్కి-యొకొండు - యెలుకనెక్కి- యొకొండు
జింకనెక్కి-యొకొండు, సెలువుగాంచు
మకరమెక్కి-యొకొండు - మనుజు నెక్కి-యొకొండు
జలదమెక్కి- యొకొండు - సంచరించు

గీ॥ కటకటా! దేవతాళికిఁ గట్టి వాహ-
నంబు లెచ్చట దొఱకెనో యంబుజాక్ష!
మించు నీగుట్టు నెవరు వర్ణించఁగలరు? భ॥ 101

సీ॥ అంతర్బహిర్వ్యాప్తి-యై, యాది మధ్యాంత
రూపకుండై నట్టి రూపివీవు!
భూతపంచకములు - భువిలోనఁ బంచీక
రణనిష్ఠ నైక్యమై ప్రిబలు నట్లు
అఖిలభూతములు, నీయందు లీనముగావె
జగదంతరాత్మ! శ్రీనిగమవేద్య!
ఆటపాటలకు బా - ల్యమున బొమ్మలఁజేసి
యాడించి తర్వాత వేడుకలర

గీ॥ వాని నాశన మొనరించు బాలు పగిది
సృష్టి - రక్షణ - సంహార - మిష్టముగను
సల్పుచుందువు త్రిమూర్తివి! జలజనయన భ॥ 102

సీ॥ అవని, యహంకార మడఁగిన, నిజమైన
జ్ఞానంబుకల్గు ; నాజ్ఞానమునను
స్థిరమైన మననంబుసిద్ధించు ; సద్భావ
నిర్గుణ మార్గంబు నిష్ఠఁజూపు
గురుదయ ప్రాప్తించు ; గురుదేవు కరుణచే
నాత్మప్రకాశంబు నందఁగల్గి
సహజ నిరామయ స్థానంబుగల్గెడి ;
పదపడి భ్రమవీడి, తుదను జనన

గీ॥ మరణ భయము దొలంగుచు మహినిశాంత
చిత్తత లభించు; నామీఁదజెందు ముక్తి
నిట్టి శ్రీదివ్యశక్తి నాకిమ్ము దేవ ! భ॥ 103

సీ॥ పాలకుండవు నీవు ! బాలకుండను నేను
భక్తిభావముల సోపాన మెఱుఁగ ?
పాలకుండను నున్న పాలుగ్రోలఁగ నాకు
వాంఛ లేపారుచుఁ బ్రబలుచుండు
పాలు ద్రావంగ, గోపాలబాలుఁడఁగాను
దొంగతనంబు నేర్వంగ లేదు
పాలుసారము దీసి పంచదారను వేసి
నాపాలు నాకిమ్ము న్యాయముగను

గీ॥ పాలితవాటినకుండ నీ పాలకుండ
లీలకై చేయఁబడిన దీ బాలకుండ
పాలకుండవు ! రక్షింపు పరమపురుష ! భ॥ 104

సీ॥ పాలకుండల మోసి పల్లెపట్టుల కేగు
భామామణుల వెంటఁ బాటినావు
పాలకుండల నట్టిపై నిడ్డ వ్రేతల
మందిరంబుల లోన మలగినావు
పాలకుండల మధ్య లీలల నెఱపుచుఁ,
బసుల పిల్లల వెంటఁబడసినావు
పాలకుండలఁబట్టి పాలు కాఱఁగఁగొట్టి
చిలిపి కర్జంబులు చేసినావు

గీ॥ పాలకుండవు గోపాల బాలకుఁడవు!
గోపికలతోడ సతతంబు కూడి యాడి
వేడుకల కొల్లగొన్నావు వినుతచరిత! భ॥

సీ॥ పాలకుండలఁ జేసి పాల జీవముఁబోసి
పాలించు కుమ్మరి వాఁడవీవు!
పాలకుండలలోని పాలు పాపల కిచ్చి
తనివితోఁ బోషించు తల్లివీవు!
పాల కుండలు రెండు పద్మాక్షుల కొసంగి
జగము లేలించెడు చతురుఁడీవు!
పాల కుండల నున్న పరిపక్వమైనట్టి
వెన్నమీఁగడ లిచ్చు విభుఁడ వీవు

గీ॥ పాల కుండలపై నున్న భ్రాంతి ద్రోలి
కుండలోపలి మధువు నాకుండఁజేసి
పాలకుండవు! రక్షింపు పరమపురుష! భ॥

సీ॥ ఇరుమబ్బుల బోలు నీలి రంగులవాఁడు
చిత్రవిలాసముల్, సేయువాఁడు
లీలతోఁ గొండఁ దాల్చిన చేయి గలవాఁడు
పిల్లనగ్రోవిచే వెలయువాఁడు
వ్రేపల్లె జనములఁ గాపుచేసెడి వాఁడు
గోపకాంతలఁ గూడుకొన్నవాఁడు
చక్కని వనమాల సొరుసు గలవాఁడు
నందపుఁ జెక్కిళ్ళ నలరు వాఁడు

గీ॥ మధురమౌ పాటలందున మఱగువాఁడు
కలువరేకులఁ బోలెడి కనులవాఁడు
వాఁడు మావాఁడు మమ్ముఁగాపాడు వాఁడు భ॥ 107

సీ॥ 'చిన్ని కుమారుఁడా! చెలువంపు మారుఁడా!
నీపేరు తెల్పుము నిశ్చయముగ'
'బలరాము విన్నావె? కులుకులాడీ నీవు!
అతని తమ్ముండ నే నతివ వింటె'
'గోపాలకుండవా? గోవులఁ గావక
నేల వచ్చితివి? మా యింటి కిపుడు'
'గబ్బిగుబ్బల భామ! మబ్బాయెఁ గనలేదు
వరుస మాయిల్లని వచ్చినాఁడ'

గీ॥ కాని, వెన్నబానలఁ జేయి కదలనేల?
యతివరో! దూడ వెదకెద నంచుఁదెల్పు
ముద్దుమాటల కర్థమేమో ముకుంద! భ॥ 108

సీ॥ కన్ను సన్నలతోడఁ గదలకుం డని సెప్పి
గోప బాలకులతోఁ గోర్కెఁ దెల్పి
పిల్లి పాదములతో మెల్ల మెల్లగ వచ్చి
మౌనవ్రతుండవై మౌన మూడ్చి
పొదల మాటునఁ జేరి, పొంచి కుందేలువై
యమునలో జలకంబు లాడునట్టి
తోయజ నయనల తోడ వినోదింప
వారు వీడిన యట్టి చీరలెల్ల

గీ॥ దొంగతనమునఁ గాఁజేసి రంగుగాఁగఁ
జెట్టు నెక్కితి వీ పిల్ల చేష్ట లేమి ?
తత్త్వమేమిటి ? కృష్ణావతారమూర్తి ! భ॥

సీ॥ మానంబు లజ్జల మమతతోఁ గొంటివి
కొంటివై వలువలఁ గొంటివీవు !
రాజుల భయముతోఁ బ్రబలు వాఁడవు కావు
బలిమితో మత్తిల్లి కులుకుచుందు
వాఁడువారలు నీరమాడు చోటులఁ జేరి
వారి మర్మంబులఁ గోరి కాంచె
దెంత రసికుఁడవో ? యింతుల చనుబంతు
లెంత నీ కిష్టమో యెఱుఁగ లేము

గీ॥ వేడ్కఁ బదునాఱువేల గోపికలఁగూడి
రతులఁ దేలుచు నున్నావు రక్తితోడ
తత్త్వమేమిటి కృష్ణావతారమూర్తి ! భ॥

సీ॥ ఏత్తూరా మగవారు వనజాక్షు లుదకంబు
లాడుచోటికి నెక్కడైన గాని
వచ్చిన నేమాయె ? వనజాక్ష ! శ్రీ కృష్ణ !
కాంచి కాంచక నీవు కదలరాదె ?
పలోక మందైన నీవింత లుండునే ?
విడిచిన చేలముల్ ముడువనేల ?
దయలేదె శ్రీకృష్ణ ! ధర్మంబుఁ బాలింప
కీ దగాగడంబేల ? యేలుకొమ్ము

గీ॥ పుచ్చుకొన్నట్టి పుట్టంబు లిచ్చిపొమ్ము
టంచుఁ బ్రార్థించు గోపిక లార్తి వినవు
తత్త్వమేమిటి కృష్ణావతారమూర్తి ! భ॥ 111

సీ॥ వలదురా కృష్ణ ! మా వలువలు ముట్టకు
కొనిపోకు కృష్ణ ! మాకోక లెల్ల
మాతప్పు లేమున్న మన్నింపుమో కృష్ణ !
మంటఁ గలుపకు మా మానమెల్ల
మామ ! ఓయీశ్రీకృష్ణ ! మానుమా హరణంబు
మానస హరణంబు మాను కృష్ణ !
మా హృదయాబ్జముల్ మనసార నీ సేవఁ
జేయుచు నున్నవో శ్రీ ముకుంద !

గీ॥ కొంటెవై మాదు చీరలఁ గొంచుఁ బోక
టంచుఁ బ్రార్థించు గోపిక లార్తి వినవు
తత్త్వమేమిటి ? కృష్ణావతారమూర్తి ! భ॥ 112

సీ॥ సత్యానువ్రతులయి కాత్యాయనీదేవి
    నీరీతిఁ గొల్చువా రెవరుగలరు ?
జ్ఞాన ముండినను, దిగంబర ప్లవనంబు
    సేతురే మీరలో వ్రేతలార !
మీ మర్మముల నెల్లఁ గామితార్థములెల్లఁ
    గంటి మీ హృదయముల్ గొంటి నేను
ఎవ్వని మోహించి యీవ్రతంబులఁ జేతు
    రెవనిపై మీకూర్మి యెఱుఁగఁ జెప్పు
గీ॥ శీతనీరంబు వెల్వడియింతులార !
వచ్చి చీరలఁ గొనుడంచుఁ బల్కినావు
తత్త్వమేమిటి ? కృష్ణావతారమూర్తి ! భ॥ 113

సీ॥ నా యాజ్ఞ వహియించి నాయింటి దాసులై
    యతిభక్తితో నడయాడవలయు
నే నన్నుఁడనుగాను నిత్యంబు మీ తోడ
    నుండనే? మీకూర్మి లోపుగాఁగఁ
దెలియనే? మీమోసముల నెఱుంగనె ? నన్ను
    దూఱగానేలనో తోయజాక్షు
లార! యంబువుల, వెల్వడి బయటికి రండు,
    కొండు మీచీరలు ; నిండు మదిని

గీ॥ గబ్బి గుబ్బతలార! మబ్బుబ్బె; మేను
లుబ్బె; నబ్బుర మేమంచు నిబ్బరమునఁ
బల్కినాడవు దీనితాత్పర్యమేమి ? భ॥ 114

సీ॥ సిగ్గుల విడనాడి యెగ్గులఁ బోనాడి
గబ్బిగుబ్బల ప్రౌఢకాంతలార!
దరిఁజేరఁగా రండు దాపుకు రారండు
వేణు గానంబును బ్రీతి వినఁడు
దేహాభిమానముల్ దీఱెనఁ గాదొకో
నిత్య తత్త్వజ్ఞాన నియతి కల్గుఁ
దత్త్వవిజ్ఞానమే ధర్మసూక్ష్మముఁ జెప్పి
మోక్షసామ్రాజ్య సమ్మోదమొసఁగు
గీ॥ రెండు చేతులఁబైకెత్తి దండ మిడుచు
వలువలెల్లఁ గైకొనుడంచుఁ బల్కినావు;
తత్త్వమేమిటి? కృపావతారమూర్తి! భ॥ 115

సీ॥ 'అమ్మరో! అక్కరో! అగడం బిదియేమి?
సిగ్గులు వోనాడె చిన్నికృష్ణుఁ
డీనీట వలిలోన నిట్లుండఁ దరమొక్కొ
వెడలి, పోదము - రండు వెడలిరండు'!
'అక్కరో! వెడలు టెట్లొక్కొ? దిగంబర
లై కృష్ణు జేర న్యాయంబె? యకట!
మగువలు మానాభిమానలై బ్రదుకరో?
మగవారు చేష్టల మానలేరు'
గీ॥ అంచు గోపికల్ దాము భాషించుకొంచుఁ
గొందలం బందుచుండినఁ గోర్కె విడవు
తత్త్వమేమిటి? కృపావతారమూర్తి! భ॥ 116

సీ॥ కాత్యాయనీ దేవిఁ గల్ల నేసితి మమ్మ!
ప్రతభంగ మాయెనో యతివలార!
వనజాక్షులకు, కట్టు వసనముల్ విడి నీట
స్నానమొనర్చు టెన్నఁటికిఁదగదు
మన యవినీతి మాన్పనుఁ గృష్ణుఁ డీరీతిఁ
జేసినాఁడమ్మరో! సిగ్గులేల?
మనవాంఛితంబు లేమఱినాఁడె కృష్ణుండు?
యతఁ డెఱుంగని మర్మ మవనిఁ గలదె?
గీ॥ యంచు లజ్జలఁ బోనాడి యతివలెల్ల
రెండు చేతులఁ బైకెత్తి దండమిడిరి;
తత్త్వమేమిటి? కృష్ణావతారమూర్తి! భ॥ 117

శ్రీ రామ స్తోత్రము

సీ॥ చిఱునవ్వు మోమునఁ జిందులాడెడివాఁడు
రమణీయ పద్మ నేత్రములవాఁడు
నీలంపు మణుల, మించిన శరీరమువాఁడు
శర చాపముల తోడ వరలువాఁడు
సూర్య వంశాబ్ధిలో, సొబగు కౌస్తుభమణి
కరణిఁబ్రకాశించి గ్రాలువాఁడు
డంబుగా మెఱయు, జటా కిరీటంబుల
నానందమూర్తియై యలరువాఁడు
గీ॥ వాఁడు మావాఁడు శ్రీరామ వల్లభుండు
చందనము, మేనఁ బూసిన యందగాఁడు
అతఁడె, భక్తపరాధీనుఁ డతఁడె నీవు! భ॥ 118

సీ॥ వేదాంత వేద్యుడై వెలయు చున్నావీవు!
ఓంకార వాచ్యుఁడై యొప్పు దీవు!
నాదప్రియుండయి - మోదమందెద వీవు!
ఆకార రహితుఁడై యలరె దీవు!
వేదాంబుజ, మరంద మాదరంబునఁ గ్రోలి
మత్తిల్లు చున్నట్టి మధుప మీవు!
క్రొత్త మేఘపు నీల రుచులతో శోభిల్లు
దేహ కాంతిని గల్గు దివ్యుఁడీవు!

గీ॥ నామములు, బెక్కు-లుండియు, నామ రహితుఁ
డగుచు, నంతరాత్ముండయి, యలరు దీవు!
ఆశ్రితుల రక్ష సలిపెడి యభయమూర్తి! భ॥ 119

సీ॥ నంద నందనుఁడ! గోవింద! నృసింహావ
తార! ఆనంద! సత్యస్వరూప!
దామోదరా! ముకుందా! వాసుదేవ! ప
ద్మాక్ష! సీతాపతీ! మాధవుండ!
పాప సంహారకా! పతితపావన రూప!
సంసార విస్తార జలధిదాట
గాఁజేయు, గంభీర కర్ణధారుండ! శ్రీ
కృష్ణావతారుఁడా! విష్ణుదేవ!

గీ॥ కాంతిచే, మనోహరుఁడవై గొల్లువాడ!
అచ్యుతానంద! శ్రీరామ! ఆదిదేవ!
నిత్యతాపత్రయంబు ఖండించుమయ్య! భ॥ 120

సీ॥ తెల్ల దామరల సంఫుల్ల నేత్రములతోఁ
బూర్ణ చంద్రుని వంటి మోము తోడఁ
గంబు గళముతోడఁ గమల హస్తముల తోఁ
బరఁగెడి శ్రీరామ! వందనములు!
పీతాంబరము గట్టి - సీతారమామణి
సేవింప ముగ్ధుడౌ శ్రీనివాస!
కారణదేహ! జగన్మోహనాకార!
భద్రాద్రి రాఘవా! వందనములు!
గీ॥ ఉజ్జ్వల లలాట భాగంబు నొప్పువాఁడ!
ఆర్య! శ్రీరామభద్ర! దయాసముద్ర!
అంబుదాకార! రాఘవా! అభయ మిమ్ము; భ॥ 121

సీ॥ సూర్యకులాబ్ధిఁగౌస్తుభ మణివై వెల్గు
భద్రాద్రి శ్రీరామ! తుభ్యంనమోస్తు
నీలోత్పలశ్యామ! నిఖిల మహాపాప
పంచకహరణ తుభ్యంనమోస్తు!
తలప, మత్స్యాంశత - తత్త్వభాసితుఁడవై
పరగెడి రామ! తుభ్యం నమోస్తు!
త్రిజగంబు, నిను సంస్తుతింపగ వెలిఁగెడి
ప్రహ్లాద వరద! తుభ్యం నమోస్తు!

గీ॥ అభయ మొసఁగెడిదేవ! తుభ్యంనమోస్తు!
అవనిజాపతి! రామ! తుభ్యంనమోస్తు!
అఖిల సురముని వినుత! తుభ్యంనమోస్తు! భ॥ 122

సీ॥ కోటి మన్మథరూప! కువలయదళనేత్ర!
రఘువంశ తిలకమా! రామచంద్ర!
కస్తూరి వాసనల్ గ్రమ్మిన దేహంబు
గల్గి, నిర్మలుఁడవై గ్రాలువాఁడ!
ఖరరాక్షసుని ధైర్యగరిమను జెఱచి
వీరాధి వీరుఁడై - వెలయు వాఁడ!
ముక్కంటి సేవల - ముదముతోఁ గొనువాఁడ!
అప్రమేయుండయి - యలరువాఁడ!

గీ॥ చంచలలకుఁ గామములఁ బుట్టించువాఁడ!
సీతతోఁగూడి శుభములఁ జెలఁగువాఁడ!
విష్ణు రూపుఁడౌ శ్రీరామ! వేదవేద్య! భ॥ 123

సీ॥ సుందరాకారుల సుందరమూర్తివి,
నయనాభిరాముఁడై నావు నీవు!
ఇంపైన వాక్యంబు లెపుడు బల్కెదవీవు!
సుందర ముఖముతో నుందునీవు
సర్వజనుల కీవు సంతోష మొసఁగుచు,
సర్వదా ముదమున బర్వెదీవు!
దశరథవరపుత్ర! దానవనాశన!
సీతామనోహరా! శ్రీనివాస!

గీ॥ రామ! జయరామ! శ్రీరామ! రామభద్ర!
భద్ర యశములఁగూర్చు, సౌభాగ్య సీమ!
నా మనంబున నిలువుము; నాగశయన! భ॥ 124

సీ॥ వైదేహికెప్పుడుఁబ్రాణ మంత్రంబైన
రామ మంత్రము సాటి భూమిఁగలదె?
విబుధ వరేణ్యుల వినుతిపాత్రంబైన
రామ మంత్రము సాటి భూమిఁగలదె?
దైత్యుల మర్దించి స్తుత్య పాత్రంబైన
రామమంత్రము సాటి భూమిఁగలదె?
జగతీ జనుల మోక్ష సాధన మైనట్టి
రామ మంత్రము సాటి భూమిఁగలదె?

తే॥ రఘుపతీ! నీ పరమమంత్రి మఘముబాపు;
దాశరథి! నీ పరమమంత్ర మాశలుమపు
జానకీనాథ! నీ నామ స్మరణ మిమ్ము; భ॥

సీ॥ నిఖిల నిలయుఁడైన నిగమగోచరుఁడీవు!
ఆకాశ రూపుఁడై యలరు దీవు!
సగుణ, నిర్గుణుఁడైన సరస రూపుండీవు!
అంగుష్ఠ రూపుఁడై యలరు దీవు!
ఆకాశ రంధ్ర మధ్యమమందు, నివసించి
మోక్షశోభను గల్గి మురిసె దీవు!
సత్త్వ రజస్తమోంత త్త్వ శూన్యుండీవు!
తరియింపఁ జేసెడి తజ్ఞుఁడీవు!

గీ॥ తత్త్వ మస్యాది లక్ష్యుఁడై దనరెదీవు!
శ్రీ సుషుమ్నా నాడిని జేరి చెలఁగు దీవు!
రామ, రక్షింపు! సీతాపతీ! ముకుంద! భ॥

సీ॥ అంజనాదేవి గర్భాబ్ధిఁబుట్టిన నాఁడె
ప్రభవించు భాస్కరు రక్తిఁగాంచి
పండని భ్రమియించి పాటినావభ్రప
థమునందు, రవి మ్రింగుతమిని; ధైర్య
వంతుఁడ వోహనుమంత! శ్రీరాముని
జేరి, సఖ్యముజేసి సీతవెదుక
దక్షిణాపథమేగి - దరియించి వార్ధి, లం
కనుజేరి, జానకి గాంచినావు

గీ॥ పిదప రావణు జేరి సంప్రీతితోడ
బుద్ధిఁ జెప్పితి వార్య! ప్రబుద్ధచరిత!
భక్త! హనుమంత! నీ సాటి వారు గలరె? భ॥ 127

సీ॥ సనకాది యోగుల శంకరబ్రహ్మల
మనములఁబొడమని మహితభక్తి
వల్లవీ జనముల యుల్లంబు లందు, జ
న్మించి, శ్రీ కృష్ణు సేవించినారు;
జపతపోవ్రతదాన సత్కర్మముల చేతఁ
బొందంగ రానట్టి ముక్తిపథము
పూర్వ సంచిత భాగ్యమున గోపికాస్త్రీలు
సంపాదనముఁ జేయఁజాలినారు

గీ॥ జన్మమరణముల్ వారికి సమసె; నిత్య
మోక్ష సౌఖ్యంబుఁబొందిరా ముదితలెల్ల
నట్టి సద్భక్తి నాకిమ్ము యవ్యయాత్మ! భ॥ 128

సీ॥ విగ్రహారాధన వృథయంచుఁ బల్కిన
    వర మహాత్ముల రూప పటము లేల ?
శిలలందు రూపములెక్కించి యందందు
    వానిఁ బ్రతిష్ఠించు పనులవేల ?
మాన్యుల చిత్రముల్ మమతఁ గోరుటయేల ?
    మృతిఁగన్న బిడ్డలు స్మృతికి రాఁగ
చిత్రాలలో వారి చెల్వులఁగాంచి యా
    నంద దుఃఖంబుల నందుటేల ?
గీ॥ మరణ మొందినవారి సమాధులేల ?
విగ్రహధ్యానమందె, యావేశమంది
నిన్నుఁగనుఁగొను భక్తుండు; నిర్మలాత్మ ! భ॥ 129

సీ॥ మానసంబున నిన్ను మననం బొనర్చిన
    బ్రహ్మవిజ్ఞానంబుఁ బడయవచ్చు
మనసంబులో నేకమార్గమే కనఁబడు
    రెండు పథంబు లఁదుండ వెపుడు
కాఁబట్టి నీరూపు కళల నెక్కువగాఁగఁ
    గాంచువారలకు సౌఖ్యంబు గల్గి
చిత్తవిభ్రమము నశించి, నిష్ఠ జనించి
    నిశ్చలత్వంబును నియతిగల్గి
గీ॥ ధ్యానసిద్ధి ప్రాప్తించు ; సజ్ఞాన ముదుఁగు
మానసానందమబ్బు ; రమావినోద !
నిత్యసంతోష ! పరిపూర్ణ! నిగమవేద్య ! భ॥ 130

అఖిలాండకోటి బ్రహ్మాండంబు లందున
వస్తువు లెన్నేని వఱలుచుండు;
నానందకరమాచు నలరు వస్తువు లందుఁ
గొన్ని కానంబడు గోచరముగ
నందు మహానందమైన పదార్థముల్
దృగ్గోచరంబగు దివ్యరీతి
మఱి యందు సత్కృష్ట మహిమఁజాటుచునుండు
వస్తువుల్ చూతుమా వస్తువులను

శ్రేష్ఠమైన పదార్థంబు శ్రీకరంబు
రూప రాహిత్యకరమునై, రోగరహిత
మై ప్రకాశించు నద్ది? యయ్యదియె నీవు! భ॥ 131

సకల భూతము లందు - సంచారము నొనర్చి
యాత్మస్వరూపివై - యలరుచుంట
నెఱుఁగక నాబోంట్లు - లెలమి వహించుచు
నీకొక రూపు సాన్నిధ్యపఱచి
స్నానంబుఁజేయించి - సరిగంచు వస్త్రముల్
ధరియింపఁజేసి, గంధంబలంది
బహువిధ పుష్పముల్ పత్రంబు లర్పించి
దీప ధూపములు విధించి, నీవు

గుడువలె నంచు నైవేద్యమిడుచుఁబిల్ల
లల్ల బొమ్మలతో నాడునట్లు దేవ!
ఆడుచున్నాము; రక్షణ వేఁడినాము భ॥ 132

సీ॥ నేత్రేంద్రియంబుల నినుఁ జూడఁగాలేము
వాక్కుచే గ్రహియింప వలను పడదు
ఇతరేంద్రియంబుల నెఱుఁగ శక్యముగాదు
తపసు సల్పంగ సాధ్యంబు కాదు
కర్మచేయుటచేతఁ గనఁబడఁగా లేవు
పూజలచే నిన్ను బొందరాదు
మానస శుద్ధితో మననంబొనర్చిన
విజ్ఞాన — దీపిక — వృద్ధిఁజెంది

గీ॥ నిన్నుఁ గాంచంగ వచ్చునో సన్నుతాంగ !
కాన మానస శుద్ధినిఁ గల్గఁజేసి
ధ్యాన సిద్ధిఁ బ్రసాదింపు ధన్యచరిత ! భ॥ 133

సీ॥ రూపులేనట్టి నీరూపు దశావతా
రములందు జూపిన ప్రభుఁడ వీవు
శ్రీరామకృష్ణులు జీసను క్రైస్తు, మ
హమ్మదు మొదలు, మహాత్ములెల్ల
నవతారముల నెత్తి యఖిల మానవులకుఁ
బొడసూపి నీయాజ్ఞ బోధఁజేసి
మాయమైనారు సుమ్మా ! నిన్ను జ్ఞాపక
ముంచి, ధ్యానింపగా నించుకేని

గీ॥ స్థిరమగు మనస్సు లేకున్కిఁ జిత్రములను
వ్రాసి, విగ్రహంబులఁ జెక్కి భక్తితో, ను
పాసనము జేయు చున్నాము ; పరమపురుష ! భ॥ 134

సీ॥ చిత్తైక్యమును జెంది శ్రీవిలాసుని నిన్ను
 మానసంబునఁ గాంచు మనుజుఁ డొక్క-
యాకారమును జూచి యానందమును జెంది
 ధన్యత నొందఁ బ్రార్థన మొనర్చు
గాక - నాయాకృతి పోకడల్ విశ్వాస
 మేమతములలో నదెట్టు లున్న
నట్టి రూపంబుల నెట్లనఁ గనఁబడు
 చుండు వాతని కిచ్చు చుండు నదియె

గీ॥ శాంతి ; భక్తుని కదియె - విశ్రాంతి దేవ !
చిన్మయానంద మదియె - లక్ష్మీవినోద !
శ్రీ శుభాకార ! గుణనిధీ ! శ్రీనివాస ! భ॥ 135

సీ॥ క్రీస్తు హింసను జేయ స్వస్తి వాచకమేమి
 పల్కఁగా లేదు సంబరముతోడ
రక్తపానమున కాసక్తిఁ జెందఁగ లేదు
 మహ్మదు తానేమి మమతతోడ
ప్రాణంబుల బలిని వాంఛించఁగా లేదు
 గురువు 'నానక్కు' బల్కుర్మితోడ
ఇతర మతస్థుల హింసింప వలెనంచు
 శ్రీకృష్ణుడేమియుఁ జెప్పలేదు

గీ॥ బుద్ధదేవుఁ డహింసకై పోరుసలిపె ;
వరమహాత్ముండు ప్రేమకై ప్రాణమిడియె
వీరి మేల్బంతిగాఁ గొన్నవారె బుధులు, భ॥ 136

సీ॥ గుడుల గోపురములఁ గూల్చిన మాత్రాన
మహమ్మదు మతము సమ్మాన్యమగునె?
ఆ మశీదుల నెల్ల నడుగంటఁ జేసిన
హిందూమతము వృద్ధిఁ జెందఁగలదె?
'గ్రంథసాహేబు'ను కాల్పెట్టి రాచిన
శిక్కుల మతము నశింపఁగలదె?
'బైబులు' గ్రంథంబు వహ్నిలో వేసిన
క్రీస్తుతత్త్వం బేమి క్రిందు వడునె?
గీ॥ అన్ని మతముల సారాంశ మరయ నొకటె
సత్య ధర్మ మహింస లెచ్చటను గలవు;
నీవె నెఱుఁగు జ్ఞానంబుమ్మ దేవదేవ! భ॥ 137

సీ॥ హిందూ ముసల్మాను లందు సోదరభావ
మేల నశించెనో యెఱుఁగరాదు
రామభజన సేయఁగా మసీదులలోని
'అల్లాకు' కోప మంచనగఁరాదు
రామాలయములో 'ఖురాను' కీర్తింపఁగా
జానకీపతి కోపజాడ్యఁ డగునె?
'రాం-రహీం-ఏక్' అని రక్తితో బోధించె
నాఁడు కబీరు సుజ్ఞాన మలర
గీ॥ లోకులకు మతమాహాత్మ్యంబు ప్రాఁకి, చెప్ప
రాని, యూహింపఁగారాని ప్రాణిహింస
లేల దిక్కులలో విజృంభింపవలయు? భ॥ 138

సీ॥ రెండు యుద్ధంబులు మండించె మంటలు,
కోట్లకొలఁది ప్రజల్ గూలినారు
నెత్తుటేఱులు బాఱె; నేల మట్టంబాయె
దివ్యసౌధములెల్ల దీనగతిని
గొప్ప మేధాశక్తిఁ గొమరొప్పు ప్రాజ్ఞులు
దివిఁజేరి రక్కటా! తెల్విదేట
లొప్పారి యభివృద్ధి నొందెడి శిశువులు
నాశనంబైరి; పేరాశ హెచ్చె
ఆ॥ మూడవ రణంబుసేయఁగా మూర్ఖులెంచు
యత్నమొనరించు చుందురు; దేవాది దేవ!
శాంతిఁగల్పించి ప్రజల రక్షణ మొనర్పు; భ॥ 139

సీ॥ శాస్త్రవిజ్ఞానంబు సర్వతో ముఖముగా
నభివృద్ధిఁజెందె; నత్యంత నిశిత
మారణాయుధములు మనుజకోటిని జంప
గాఁ బొడసూపె; లక్షలకొలంది
'ఆటమ్బాంబు' హాహాకారములఁ గూర్చె
'రేడియో యాక్టివు' వేఁడి వేఁడి
మంటలఁగ్రక్కుచు మండంగఁ జొచ్చె; ని
దేమి చోద్యము? మూల మెఱుఁగరాదు
గీ॥ శాస్త్ర విజ్ఞాన సంపద సకల జనుల
కియ్యవలెఁగాక సౌఖ్యంబు, లిచ్చకొలఁది
రక్తపానంబు గోరునే? ప్రభువరేణ్య! భ॥ 140

సీ॥ అమెరికాఁ దలదన్ను నట్టి యాటమ్ముబాంబు
లభివృద్ధిఁ జేయ, రష్యాతలంచె ;
రష్యాను మించెడి ప్రజ్వలాయుధముల
నమెరికా చేయించె నాత్మశక్తి,
రాజ్యాభిలాషులై రాజు లన్యోన్య, వై
రముల మత్తిల్లి - సంగ్రామవాంఛ
శాంతి దేశములను స్వార్థ లాభములకై
తమవెంట నీడ్చుచు ధాత్రినెల్ల
గీ॥ నరక లోకంబుగా మార్చఁబరగినారు ;
ఇట్టి దుష్టుల కిప్పించి గట్టిశిక్ష
శాంతిఁ గల్పింపుమో జగజ్జనక నీవు ! భ॥ 141

సీ॥ 'బాలచంద్రుఁడ'ను నుపగ్రహామొక్కండను
నిర్మించె 'రష్య' ధీ - నియుతి తోడ
రోదసీ కుహరంబులోఁ దిరుగాడి, భూ
గోళంబు చుట్టాడెఁ గుతుకమలర
గ్రిహమందు నొకశునకంబుఁబరీక్షకై
బెట్టిరి ; రేడియో సెట్టు లూహ
కందంగ రానట్టి యద్భుత యంత్రంబు
లందమర్చిరి ; వార్తలందునుండి
గీ॥ భూమికే తెంచె ; రష్యన్ల బుద్ధి బలము
శక్తియుక్తుల కారణ శక్తివీవె !
శక్తులకు పరాశక్తివి ; జలజనయన ! భ॥ 142

సీ॥ చంద్రగోళముఁజేరఁ జాలెడి రాకట్లు
నిర్మించినారలు, నిమిషమునకు
మూడువందలమైళ్లు, వేడుకగా, రోద
సీ కుహరపథంబుఁ జీల్చివెళ్ళి
కొన్ని గంటలలో, నిగూఢప్రదేశముల్
దాటుచుఁ దుదకుఁ జంద్రునిఁజేర
నమెరికా రష్యన్లు లగచాట్లఁబడుచుందు
రొక్కరి మించంగ నొక్కరుండు ;

గీ॥ ఇట్టి విజ్ఞాన జ్యోతి వారెట్టు గాంచి
నారు ? నీయొక్క దయలేక నాథ ! జ్ఞాన
మభ్యుదయ మార్గములఁబోవు నట్లొనర్పు ; భ॥ 143

సీ॥ స్వేచ్ఛావిహారులై పరిచ్ఛిన్న కాపట్య
బుద్ధులై విహరింపఁబూనువారు
స్వార్థాభిలాషులై సంపద లార్జింప
నెన్నేనియుఁ గుయుక్తు లెన్నువారు
మతమాఢ్యమున మున్గి మర్యాదఁ బోనాడి
చెనటి కార్యంబులఁ జేయువారు
నాస్తికత్వపు బుద్ధి నాట్యంబు ద్రొక్కఁగా
ధర్మంబు కాల్దన్నఁ దలచువారు

గీ॥ లెక్కకును మించియున్నారు ; కుక్కలట్లు
కాట్లులాడుచు నున్నారు కబళములకు
కడుపు కొఱకింత శ్రమలేల కమలనయన ! భ॥ 144

సీ॥ సైన్స విజ్ఞాన శాస్త్రము నేర్చి లోకులు
మించు కీర్తిని వహియించుటెల్ల
నాకాశమున నడయాడు విమానముల్
వివిధరీతులఁ జేసి వెలయుటెల్ల
సంద్రంబులందు వే సంచారముల సల్పు
స్టీమర్ల నెన్నొ సృష్టించుటెల్ల
భూమిపై బరువెత్తు మోటార్ల రైళ్ళను
వేవిధంబుల గనిపెట్టుటెల్ల

గీ॥ తంతివార్తలు టెలిఫోను వింతలన్ని
రేడియో శబ్ద విధము దెలియుటెల్ల
మహితమైనట్టి నీయొక్క మహిమ కాదె! భ॥ 145

సీ॥ టకటక పరువెత్తు ట్యాంకుల నిర్మించి
భీకర దనుజులై వెలసినారు
వైరివీరులఁ జంప బాంబుల నిర్మించి
మృత్యుదేవతనైన మించినారు
ఆకసంపు గొడుగు తోడ్కలతో డిగ్గి
గంధర్వులను మించి క్రాలినారు
అంబుదంబుల నెత్తిపై నాడెడి విమాన
తతులచే సురలఁ గాల్దన్నినారు

గీ॥ ఔర! మనుజులు కలియుగమందు నీదు
మహిమచే బుద్ధిబలమున మహితకీర్తిఁ
జెందుచున్నారు; దీనివిశేషమేమొ? భ॥ 146

సీ॥ జర్మనీ హిట్లరు సాహస కృత్యముల్
భూమండలంబేలు పొలుపుఁ గనెనె ?
చర్చిలు ధీర విచార విజ్ఞానంబు
రాజ్యంబు రక్షించి రక్తిఁ గొనెనె ?
మనులోని ధీయుక్తి మానిత భుజశక్తి
శాత్రవ వ్యూహంబుఁ జంపఁగనెనె ?
ఘోర రజాకార్ల క్రూరకృత్యంబులు
సఫలమగుచు, సంతసంబు గనెనె ?

గీ॥ ఓ ! దయామయ ! నీదయ యొకటి లేక
యున్న నేకార్యములు గావు ; తిన్ననైన
కార్యముల సాధనముసేయు కర్తవీవె ! భ॥ 147

సీ॥ మారణయంత్ర నిర్మాణముల్ సలుపుట
నరజాతి నిర్మూలనంబు కొఱకె
చిచ్చుబాంబులు వేడిచే వెల్లువెల్ల, న
గర పట్టణ ధ్వంసకాండ కొఱకె
విషవాయు వితతిని విడుచుటెల్లను భూత
గణములఁ జంపఁగాఁ గడఁగు కొఱకె
పదివేల మైళ్ళతోఁ బరుగెత్తెడి విమాన
తతుల నిర్మించుట మృతులకొఱకె

గీ॥ కాని మఱియొండు జగతిలోఁ గానరాదు
సర్వసోదర భావ వైశాల్య మబ్బి
సౌఖ్యమీయని శాస్త్ర విజ్ఞానమేల ! భ॥ 148

సీ॥ దేహంబు రక్షింపఁ దినుటయో ? లేకున్నఁ
గుడువఁగా జన్మంబుఁ బడసి నామొ ?
జన్మకారణ మేమొ ? జనని గర్భము నుండి
జారినదాదిగా సకల జనులు
ప్రొద్దస్తమానంబుఁ బొరుగువారలఁ జేరి
నీచసేవలఁ జేసి, నిర్మలంబు
లైన భావంబుల నడుగంటఁద్రొక్కి, స్వో
దర పోషణములకే తల్లడిల్లి

గీ॥ బ్రదుకు కాలంబు నంతయు వ్యర్థ మౌప
నిన్నెఱిగి ధ్యాన మొనరించు టెన్నఁడింక ?
చిన్మయానంద ! గోవింద ! శ్రీ రమేశ ! భ॥ 149

సీ॥ ఆటము బాంబుల పాటవంబుల, పరీ
క్షలటంచు రష్యన్లు కడలు లందు
ద్వీపంబులన్జేరి, వెలిఁగించు చున్నారు
హైడ్రొజన్ బాంబులహ్వారె ! వారి
మించఁగా, నమెరికా మేళవించెను ; విష
పూరితంబయి, వాయువులు, ప్రపంచ
మును, ఘోష పెట్టెను ; భూభాగమును, మృత్యు
ధూళి నిండెను ; కటా ! ఘోరమైన

గీ వింత వింత రోగంబులు వెలయఁజొచ్చె ;
నిట్టి మృత్యు విజ్ఞానంబు మట్టుఁబెట్టి
లోక కల్యాణ మొసఁగుమా లోకనాథ ! భ॥ 150

## క లి కా ల ము

సీ॥ అల "కలౌ పంచ సహస్రాణి - జాయతే
వర్ణ సంకరము"ను బల్కెమాట
వ్యాసమహాముని వాక్రుచ్చె నారీతి
నేడు సంకరవర్ణ నియతి కల్గె
బ్రాహ్మణ క్షత్రియ వైశ్యశూద్రుల లోన
నంతర్వివాహంబు లగుచునుండె
మతకుల భేదముల్ మాయంగ జొచ్చె, మా
దిగ సహపంక్తులు తీవ్రమయ్యె
గీ॥ తురక క్రైస్తవ జాతులతోఁ గరగ్ర
హణము లయ్యెను; కలికాలమార! చిత్రి
చిత్ర మార్పులు సంభవించెను; ముకుంద! భ॥ 151

సీ॥ తండ్రి బ్రాహ్మణుఁడాయెఁ దల్లి భోగము దాయె
పుట్టిన బిడ్డలకెట్టి కులమొ?
తనయుండు 'కమ్మ' యాతని తన్వి జంగము
వాలు; పిల్లల కులమేల బలుక?
తనయ, వైశ్యకులమాతన్వి యాంగ్లేయుఁడిఁ
గూడగాఁ గల్గెడి కులమదెద్ది?
గొల్లలు దురకలఁగూడిన కులమెద్ది?
చాకిమంగలి బిడ్డ జాతియెద్ది?
గీ॥ పురుషజాతి, స్త్రీ జాతి, యీభువిని రెండు
కలవు; కులమతభేదముల్ దలఁపరాదు
కట కటా! చిత్ర మీ కలికాలమహిమ! భ॥ 152

సీ॥ ఇరువదైదును, ముప్పదేడుల మించిన
గబ్బిగుబ్బలవారు గలరు; పెండ్లి
కాని వారింటింటఁ గన్నవారెటు నిద్రఁ
బోవుచు నున్నారొ? ప్రావ్రబోఁడ్ల
కేమి? స్వతంత్రులై కామితాభీష్టముల్
నెరవేర్చు కొందురు నీతి దప్పి
శారదా చట్టంబు సర్వసంకటమాయె
బాల్యవివాహముల్ వదలిపోయె

గీ॥ ప్రౌఢ వైవాహికంబులు పరుగులెత్తె
'రెంటికిఁ జెడ్డరేవఁడై' గృహిణియేడ్చె;
కటకటా! చిత్రమిూ కలికాల మహిమ! భ॥ 153

సీ॥ ఒకనికి మోమిచ్చి, యొకనికి మనసిచ్చి
మఱియొక్క మగనికి మాట యిచ్చి
వేఱొక్క విటకాని వెలఁది తాఁబొందుచు
మగని ప్రక్కన మటుమాయఁజేరు;
సంసారిగా, నెఱజాణగా, విటకత్తె
గా, నటియించును కాంతయొకతె
సినిమాలలోఁజేరి, చెలువుకాండ్రను గూడి
తాఁబతివ్రతయన దగరు నొకతె;

గీ॥ ధనమె దైవంబు, దాని సాధనము కొఱకు
మదవతులు హీనకృత్యముల్ మానలేరు;
కటకటా! చిత్రమిూ కలికాలమహిమ! భ॥ 154

సీ॥ ముండమోపులు నేడు ముత్తైదులైరి, సం
సారులే లంజలై నారు ధరణి
సంకర జాతి సంసారముల్ వృద్ధియె
స్వచ్ఛజాతులు బాడువాఱె నేడు
పసపు కుంకుమం బెట్టు పడతులు కఱవైరి
స్నో - ఫేసు పౌడర్ల షోకు హెచ్చె
హరికథల్ వినువార లనుమానమైనారు
సినిమాల మోజులు ఘనము లాయె
గీ॥ కాఫి పలుమాఱు గ్రోలుటే కలిని మించె
పుష్టిగా భుజయించెడి పొలుపు దఱిగె
కటకటా ! చిత్రమిా కలికాల మహిమ ! భ॥ 155

సీ॥ వ్యభిచారములు సేయు టాచార విధులాయె
నేలపై క్రాపులు (crops) నెత్తికెక్కె ;
'నేవికట్' త్రాగుటే - నిత్యాగ్నిహోమంబు
ప్రియమైన జపము 'కాఫీ' జపంబు
నెపము లెన్నుటె నిత్య తపమాయె సతతంబు
రాగంబుతో నుంట యోగమాయె
ఇంటింట రేడియో జంటలు బాడుటే
పారాయణము లాయె ప్రతిదినంబు
గీ॥ దుష్ట పశు కీటకక్రిముల్ తోరమాయె
శిష్ట పశుపక్షి జాతులు నష్టమాయె
కట కటా ! చిత్ర మిా కలికాల మహిమ ! భ॥ 156

సీ॥ అమ్మ విషంబాయె - నాలు బెల్లంబాయె
 జానమాటలు, కండచక్కెరాయె
నగ్నిసాక్షిగఁ గొన్న - యాలు జేదాయె, లం
 జల కాపురంబులు సొలుపుగాంచె
నన్నదమ్ములు విషంబైరి ; బావమఱదు
 లనఁగు బంధువులైరి యకట ! అక్క
చెల్లెండ్రు పెరవారు - చేసియ సోదరీ
 మణులెల్లఁ దనవారు ; మందిరమున
గీ॥ దైవతారాధనము సేయు తండ్రి, కూలి
 బాపనయ్య ; చెప్పనదేమి పాపమెచ్చె ;
కటకటా ! చిత్రమీ కలికాల మహిమ ! భ॥ 157

సీ॥ అమ్మబిడ్డల కిచ్చినట్టి భూముల, కాశ
 పడునట్టి దుర్మార్గ పరులుగలరు
తాత తండ్రుల యాస్తిఁ దామారగించుచు
 పితరుల మఱచు, దుర్మతులు గలరు
కన్నతల్లిని యష్టకష్టంబులఁ బెట్టు
 రాక్షసాధములు, పుత్రకులు గలరు
అత్తసేవలఁగొని - యామీద యత్తల
 శుశ్రూష సలుపని స్నుషలు గలరు

గీ॥ తండ్రులను, తిట్టికొట్టెడు తనయు లుంద్రు
తనయులను, హింసపెట్టెడు తండ్రు లుంద్రు
యిట్టి దుష్టుల శిక్షింపఁ గట్టిగాగ భ॥ 158

మదముగా వెలయు, త్రిమూర్తుల విడనాడి
వారి భార్యల గౌరవంబు మఱచి
నరసింహ, వామన, నారాయణాది, ద
శావతారంబుల, సేవ మాని
'మల్లమ్మ' 'ఎల్లమ్మ' - 'మారెమ్మ' 'కొల్లాపు
రమ్మ' ల, సేవించి రక్తితోడ
'శాకినీ' భూత, పిశాచాలఁ బ్రేమించి
వక్రరీతుల వాని వశమొనర్చు

కొంచు, హీనపశు కృత్యంబు లంచితముగఁ
జేసి పాపాత్ములై కీయు కుత్సితంబు గలిసిఁ
బెక్కు రుద్రుఁడ ; వీరల కిమ్ము పెద్దశిక్ష భ॥ 159

చేయెత్తి దానంబుఁ జేయనేరని లోభి
పంచలఁ జేరంగఁ బనిచి నావు
కాసు కాసుకు వడ్డికాసులఁ గూర్చు, ని
ర్దయునిఁ జేరుమటంచుఁ దఱిమినావు
అన్యాయ మొనరించు వ్యాపారి బోషాణ
మందుండఁ బొమ్మంచు నంపినావు
కులట, తస్కర, నీచకులుల, నధర్మ ప్ర
వర్తనులఁ దగిలి వాసమొనర

నలుపు మంచు లక్ష్మినిఁబంపి సరసిజాక్ష!
భక్త వత్సలమ్ము నీ భక్తులకును
కాపు పెట్టితి విది కలికాలమహిమ! భ॥ 160

సీ. కనఁగఁ గన్నులులేక - వినఁగ వీనులులేక
నడయాడఁగాఁగాళ్లు తడబడంగ
నోటమాటలురాక - నడుతొట్రుపాటులై
తలఁపులు రాక మాంద్యంబుగమ్మ
"హా దేవ! హా శ్రీ మహాదేవ! యమరాజ!
మిత్రదైవంబ! మమ్మెత్తికొమ్మ
బ్రదుకవల" దటంచుఁ బలవించు ముసలుల
వీక్షి, బాలుల బ్రౌఢ వెలఁదుల, యువ

గీ. కులను గొనిపోవు చున్నాఁడు క్రూరయముఁడు
కలియుగము; దేవతల బుద్ధి కలవరంబు;
వారి బుద్ధుల మార్పవేవరు హరీ! భ॥ 161

సీ. తినఁగ భిక్షలుచేరు - తినలేరు దానేమి
దానధర్మము సల్పు తలఁపు లేదు
ధనము గూడఁగఁబెట్టి - తన్నొసెందుటెకాని
తీర్థయాత్రలు సేయు తెల్విలేదు
పరభాగ్యములఁగాంచి, పరుల యున్నతిఁ గాంచి
క్రుళ్ళి వాపోవుచు కుంది కుంది
తనకీర్తి, తనమూర్తి, తనవైభవంబుల
స్తుతియించు కొనుచుండు సతము, మూర్ఖ

గీ. జనుఁడు; మర్యాద తెలియఁడీ జగములోనఁ
గన్నగానము; శ్రీపతీ! కమలనయన!
కట కటా! చిత్రమీ కలికాల మహిమ! భ॥ 162

సీ. సత్కార్య మొకటైన, సల్పనోపరు గాని
పరులు జేయగ బాఫ పడుచు నుంద్రు
ఉపకారములు సేయ నుత్సహింపరు గాని
యపకారములు సేయ నభిలషింత్రు
[illegible] సెప్పఁగ సిద్ధపడెదరు గాని
[illegible] భాషింప కుందురి
పరనింద లోనరింపఁ బాల్పడుదురు గాని
తమతప్పు లొకటైనఁ దలఁపకుందురి

తే. మూర్ఖజనములు ; ఏలు మూఢజనులో ?
మందమతులో ? యజ్ఞానులో ? మాధవా ! ము
కుంద ! తిద్ది తీర్పుము వీరి సుందరాంగ ! భ॥ 163

సీ. జలతారు దుప్పట్లు శాలువ లానాకు
నిక్కర్లు బనియన్లు నీటు నేకు
పాలుపారు బంగారు భూషణంబులు నాకు
షోకుగాగ, గిల్టు సొమ్ము నేకు
పసమించు మైనిండు - పట్టు చీరలునాకు
యింపు సొంపారు వాయిల్సు నేకు
రాణా మీాజెపు, హరిద్రాకుంకుమల్ నాకు
టకటాంకు స్నేను పౌడర్లు నేకు

గీ. టూతువేస్టులు, క్రాంచి కట్టులును, నిత్య
విధులు నేడాయె ; సౌరార ! వింతలెన్నొ
కలినిఁబుట్టెను వర్ణింప నలవికాదు ! భ॥ 164

సీ॥ పాటుంతో, మొస్త్రంతో మోటుదోలుట నాడు
తంటాలు లేని కరెంటు నేడు
ముదమిచ్చునట్టి దమా, ముదప్పు దీపము నాడు
టకటకు టిక్కులు - 'టెంలైట్' 'కక్కు' నేడు
పిలగా నాకెను - తోలుబొమ్మలు నాడు
కీలు కేరట్టి, టాకీలు నేడు
పదునారు కల్ల - రూపాయ కిచ్చిరి నాడు
రూపాయ కొక సేరు కూడ నేడు

ఆ॥ నాడు ధర్మంబు లానాడు తనివిగాగ
పిచ్చమేలేదు - పిల్లికిం పెట్టనేదు
కలియుగములోన, నెట్టిమార్పులు ఘటిల్లె : భ॥ 165

సీ॥ అర్ధసేరాహార - మరుదారగా నాడు
అర్ధపావాహార మయ్యె నేడు
పంచ భక్ష్యములతోం బరమాన్న మానాడు
తేలిపోయెడి, చపాతీలు నేడు
చిక్కు జక్కెరపాల - జిగిబిగి యానాడు
పస తొలంగిన నీళ్ళపాలు నేడు
ఘనమైన వెన్నకాచిననెయ్యి - అనాడు
డాంభిక మైన, డాల్డాలు నేడు

ఆ॥ ఇట్టి యాహారమును దిన నిచ్చగించు
ప్రజల కాయురారోగ్య సంపదలు భువిని
కల్గ నేరీతి నీ కలికాలమందు ? భ॥ 166

సీ॥ పండిత సభల కాహ్వానించి, కవుల, స
త్కారంబుఁ జేయని కలుష మతులు
వైవాహికాది శుభ కలాపములకు, ర
మ్మని, యవమానించు మందమతులు
సభలలోఁ గొండఱి సంభావన మొనర్చి
యితరులఁ దలఁపని హీనమతులు
కానుకఁ గొఱగాని కవితల మెచ్చి, యి
ష్టార్థంబు లొసఁగెడు వ్యర్థమతులు
గీ॥ స్తోత్రమొనరించి, తమచుట్టు జుట్టి తిరుగు
వారి కపటంబు లెఱుఁగని వారె కలిని
పెక్కురుండ్రు; వీరల కనువిప్పుమయ్య! భ॥ 167

ఆ త్మ వి చా ర ము

సీ॥ గర్భస్థమై, జీవకణము వికాసించి
శిశువుగా జెన్నొంది చేవఁగల్గి
క్రమముగా మాసముల్ గడవఁగా నంగాంగ
వితరణంబుల, నభివృద్ధిఁబొంది
తన్ను మోయుచునున్న తల్లి కాయాసంబుఁ
గల్గించి, పెఱుగుచు గర్భమందు
నరక వేదన లంది - 'నాథ! శ్రీనాథ! జ
న్మము, మఱికేల? మాయలోన
గీ॥ ముంచ వలవ' దంచు శిశు వుదంచితముగ
పలవరించుఁ; గర్మఫలమువల్ల జన్మ
ఫలముఁ దప్పింప సాధ్యమే? కమలనయన! భ॥ 168

శివుండనాదియై వెలుగుచుండు సతంబు
నాశనమౌ జీవునకు హాని కల్గు
జీర్ణమౌ చేలముల్ బూర్ణంబుగా విడి
క్రొత్త బట్టలు గట్టుకొన్న రీతి
పూర్వదేహంబును బోనాడి జీవుండు
శిశుదేహమను క్రొత్త చేలమందె
ఇట్టి దేహంబుల నెన్నింటిని నేనాడొ?
యెన్ని విడిచినవాడొ? యెఱుంగలేము
పూర్వజన్మంబు లెన్నియో? ముందు కెన్ని
జన్మములు గల్గు నున్నవో జలజనయన!
నీ మహామాయలం దెలియగా నేరరెవరు? భ॥ 171

నవరంధ్రముల కొంప - నట్టేటిలో గంప
ముప్పాలం బెట్టెడి ముప్పకంప
ఎముకల గూడు, మాంసముల పీడు, మజ్జకే
కాడు, సంకటముల పాడు నాడు
దుర్వాసనల వత్తి, తోలుకు కప్పు తిత్తి
మిత్తి దహించెడి మేలి ప్రత్తి
మలమూత్రముల కిక్కు, మాటల పెనుఠక్కు
కలకు పలుకుల కిక్కు - మొఱుంగుకుక్కు

దేహ మీ మోహమునం బడి తెలివి లేక
నీ హాజంపక, జవి తా నీషములందు
వక్రమార్గంబు మాన్పవే - వనరుహాక్ష! భ॥ 172

సీ॥ 'కవులార! పాండిత్య ఘనులార! ప్రజలార!
మొద్దు నిద్దురలేల? ముదముతోడ
లెండు; ప్రార్థనఁ జేసికొండు; కవనమల్లి
దేవుని పొగడుడీ దివ్యముగను
పాటలఁ బాడుడీ; పాడు సంసార, తా
పత్రయంబులు ముంచుఁ బడఁతులార!
అరుణోదయాత్పూర్వ - మరుదుగా లెండు, మా
నసము, స్వచ్ఛముగాఁగఁ బొసఁగియుండు
గీ॥ దేవ దేవు నామంబుఁ జింతింపు' డంచుఁ
గూయుచుందుఁ గాలజ్ఞాని; మాయనిద్ర
వీడఁజాలము; గనుఁవిప్పవే మహాత్మ! భ॥ 173

సీ॥ తలిదండ్రులను, మమత్వంబుతోఁ బెంచిన
పితరుల ఋణముల వీడుటెట్లొ?
నవమాసములు మోసి, జవసత్త్వముల రోసి
కన్న, తల్లుల యప్పు గడచుటెట్లొ?
విద్యయు, బుద్ధి, వివేకంబు లొసఁగిన
తండ్రుల ఋణబాధ తప్పుటెట్లొ?
జ్ఞానోపదేశంబుఁ గడఁగి చేసినయట్టి
గురువుల ఋణభార మరుగుటెట్లొ?
గీ॥ పెండ్లియాడిన వెలఁదులఁ బ్రీతిఁబొంది
సౌఖ్యమందిన ఋణములు సమయుటెట్లొ?
నీ ఋణము దీర్చు తెరువేదొ? నీరజాక్ష! భ॥ 174

పులి చర్మ మమ్మడు వోవు నూర్ల కుపైన
నరచర్మ మమ్మఁగా ధరలు లేవు
ఏన్గు దంతంబుల కెత్తురు ధనరాశి
మనుజు దంతంబులు బనికిరావు
కేకి పింఛాక్షులు - కూకలొసంగును
నరుని చర్మాక్షులు నాశనములు
పక్షి ఈకలను, ద్రవ్యంబిచ్చి కొందురు
మనుజు కేశంబు లమంగళములు

మరణ మొందిన తర్వాత మానవులను
గాంచు వారలు లేరు ; శ్రీ కలిమియున్న
కాలమున నిన్నుఁ జింతింతు కమలనాభ ! భ॥ 175

ఎంతకామమొ ? భార్యకొంత దూరంబైన
జీవి, యల్లాడుఁ జింతఁజేసి
ఎంత కూర్మియొ ? పుత్రు లింత దూరంబైన
ప్రాణి, చింతించును రక్తిఁజేసి
ఎంత ప్రేమమొ ? పుత్రి కాంతు నింటికి నేగ
మనసు కుందుచు నుండు మమతఁజేసి
ఎంత మోహంబొ ? తన్నెత్తిపెంచినవారు
తనువీడ నాత్మతాఁదల్లడిల్లు

సతులు, సంసార శాస్త్రయుఁబుఁబెంచి
మోహ నిభ్రాంతి మాయలో ముంచివేసి
నావు : దరిఁజేర్పఁగల్గెడి నావ వీవె ! భ॥ 176

సీ: బాల్యమందాటలఁ బాటలలోఁ గాల
ము గడచి పోవును ముదముతోడ
కౌమార ప్రాయంబు గడచు, విద్యాబుద్ధి
వాక్ప్రౌఢిమ గడింప వసుధయందు
యౌవన ప్రాయంబు - జవ్వన స్త్రీల, కే
ళీ విలాసములతో, లీలఁగడచు
వార్ధక్యదశలోన వణఁకు సంగాంగంబు
లేకార్యమొనరింప నిచ్చలేక
గీ: నాయువు సగంబు నిద్రలో వ్యర్థమగును
రోగములఁ గొంత ; చింతలలోనఁ గొంత
కడచు ; నినుఁ జింతసేయఁగాఁగాలమేది ? భ॥ 177

సీ: పత్నులు, బిడ్డలు, బంధులు, గృహాలు, ఋ
ణానుబంధము లవశ్యంబు వీని
ననుభవింపగవలె - వద్దు చెప్పగరాదు
తండ్రి ఋణముఁ దీర్ప తనయుఁడుండు
తనయునికి, ఋణంబు - తండ్రి తా నుండినఁ
దివికి యా ఋణమును దీర్పవలయు
ఋణములతోఁ బుట్టి, ఋణములఁ దీర్పఁగఁ
జచ్చి, పుట్టును జీవి జన్మమెత్తి
గీ: కట్టి జన్మంబు లెన్నింట్లఁ బుట్టవలెనో ?
జీవికెన్నండు మోక్షమో చెప్పరాదు
చచ్చి పుట్టెడు బ్రతుకు మోక్షంబుగలదె ? భ॥ 178

కాశికాపురనాథుఁ గాంచు భాగ్యములేదు
రామేశ్వరము జూచు వ్రతములేదు
పండరీ నాథుని పాదసేవ లేదు
ఉడిపి కృష్ణుని సేవలందుగలేదు
గోకర్ణ గయలను కోరిచూడగలేదు
పక్షి తీర్థంబు - సేవనము లేదు
భద్రాద్రి శ్రీరామ భద్రుఁ జూడఁగ లేదు
షర్డినాథుని సేవ జరుగలేదు

కాలమెల్ల సంసార వికార మోహా
వార్థిలో మున్గి కడచె ; శ్రీ వాసుదేవ !
ఎట్లు దరియింపఁ జేసెదో యింకనన్ను ! భ॥ 179

పూరీ జగన్నాథుఁ బొలుపార సేవింప
గంగలో స్నానమాడంగలేదు
బదరినాథుని గాంచు భాగ్యమూ లేదు, ద్రా
క్షారామ మెన్నండు గాంచలేదు
కంచి కామాక్షిని కలలోన జూడను
మధుర మీనాక్షిని మఱచినాను
శ్రీ యహోబల నారసింహునిఁ గాంచను
తిరుపతి వేంకటేశ్వరుని గాన

మల్లికార్జుని నెన్నడో మఱచినాను
కాలమెల్ల, సంసార వికార మోహా
వార్థిలో మున్గి కడచె ; దేవా ! జోహారు ! భ॥ 180

సీ॥ ఏకాదశీ వ్రతంబెన్నడుం జేయగ లేదు
శివరాత్రి నుపవాస సేవలేదు
వాసరములు భక్తి సల్పగలేదు ; దేవా
లయములకేగి చేసిన పూజలేదు
వేదవిప్రుల పూజ వెదకిచేయగలేదు
గోసేవ లెప్పుడు కూడలేదు
అన్నదానము సేయ నవకాశములు లేదు
ఘనదాన మివ్వ విత్తంబులేదు

గీ॥ విద్యనో కోటి తెలుసని విర్రవీగితి
నాడ ; సంసార యాత్రకై నానశయన !
పాపమో ? పుణ్యమొ ? యెఱుంగ పంకజాక్ష ! భ॥ 181

సీ॥ సంధ్య వార్చుటలేదు - జపతపంబులు లేవు
మాధ్యాహ్నికపు మాట మఱచి పోయె
దేవతార్చనలేదు - జీవతృప్తియు లేదు
దానధర్మంబుల దలపలేదు
అతిథుల నభ్యాగతాది సాధులసేవ
సల్పగా యోగ్యత జాలలేదు
తీర్థాటనములేదు క్షేత్రసేవల బ్రోవ
సామర్థ్యమూ లేదు - సరసిజాక్ష !

గీ॥ పాడు సంసారమనెడి కూపమున మున్గి
కన్నుగానక యల్లాడు చున్నవాడ
దరిని జేర్చి రక్షింపు మాధవ ! ముకుంద ! భ॥ 182

సీ॥ ప్రౌఢ సమాసంబు సుద్దులతో వెళ్లెఁ
గడుపుకై తంటాలు బడఁగవలసె;
ఉద్యోగ మొనరింపకున్న, భుక్తికిలేదు
భుక్తియాలోచనాసక్తి హెచ్చె
సంతతి బలఁగ విచారంబు హెచ్చె; స
తీసుత వ్యామోహ తీవ్రతయును
హెచ్చాయె; భక్తితో నిండు మనస్సున
నినుఁ బ్రార్థనము సేయు నిష్ఠలేదు
గీ॥ ఎప్పుడో? యేమొ సినిమాది యిచ్చకొలఁది
పద్యములవ్రాసి పిచ్చిగాఁ బాడుకొందు
భావమెఱిఁగి, రక్షింపవే భక్తవరద! భ॥ 183

సీ॥ అధ్యాపకుఁడయి, విద్యార్థి సంతతికెల్ల
ముప్పదేండ్లుగ విద్యముదముతోడ
నా నేర్చుకొలఁది, మన్ననతోడ నేర్పితిఁ
బొట్టకై కూలిని బొంది; యాలు
బిడ్డల రక్షింప, బిసరుహనేత్రా! వి
ద్యాదాన మన్నింట యధికమండ్రు
కీర్తిదాయక మందురు; కీర్తియో? శ్రేయమో?
చేయఁగాఁదగు దానిఁ జేసినాఁడ

గీ॥ మిగులు కాలంబు నెల్లను మేటిపద్య
కోటికై వెచ్చింప, నినుసదా గోరువాఁడ
నాయు రారోగ్యభాగ్యంబు లమరనిమ్ము; భ॥ 184

సీ. ఎందు నున్నాఁడవో ? ఇందీవరాక్ష ! నా
కన్నుల కొకసారి గానఁబడవు
కన్నుల కగపడకున్న నేమాయె ; నా
భావంబునకుఁ దోఁపవలెను గాదె ?
శ్రీరామ ! శ్రీరామ ! సీతాపతీ ! మాధ
వా ! కమలాక్ష ! శ్రీ వాసుదేవ !
గోపికాలోల ! యదుకులవరద ! రుక్మి
ణీనాథ ! శ్రీకృష్ణ ! నీదురూపు
తే. కలలనైనఁ జూపుము దేవ ! కాంచినన్ను
సంతసము జెందఁగోరెద మంతనమున
నీదు భక్తుని జేపట్టు నియతికలదె ? భ॥ 185

సీ. ఏబదిపై యెన్మిదేఁడుల వయసు, యా
రోగ్య భాగ్యంబుండు రూఢిగాఁగ
నేటికి ; ముందెట్లొ ? నీరజాక్షా ! ఆయు
వు కొలత, నెఱిఁగిన పురుషుఁడెవఁడు ?
అజ్ఞాన దశలేని యాయువు నిమ్ము ; పు
త్ర పుత్ర భాగ్య సంప్రాప్తి కలిగె;
భాగ్యమడుగఁగాను, పస్తుపెట్టకు మమ్ము
కూటికిఁ గుడ్డకుఁ గొదువలేక
గీ. వచ్చి పోయెడి, యతిథి యభ్యాగతులకుఁ
భిక్షువుల కిడవలసిన భిక్షలొసఁగి
అల, గృహస్థాశ్రమము రక్ష సలుపుమయ్య ! భ॥ 186

సీ: ఆయురారోగ్యభాగ్యము లిమ్ము కమలాక్ష !
నిను సదా ప్రార్థింప నెమ్మితోడ
బుద్ధి వైభవములు పొలుపొందఁజేయుమా
శ్రీపతీ ! నిన్నెప్డు చింతసేయ
సంసార బాధలు సంహరింపుము దేవ !
భక్తితో సతతంబు భజనసేయ
ఆయాస మలసత్వ మంధకారము జిమ్ము
మబ్జాక్ష ! నీధ్యాన మర్థిసలుప

తే॥ మంచి కార్యముల్సలుప సుదంచితముగ
యత్న మెన్నగ వచ్చు ; నభ్యంతరములఁ
బొలియఁ జేసి, రక్షింపుమో తోయజాక్ష ! భ॥ 187

సీ. నీ రక్షలేకున్న నిమిషంబు గడచునే
శ్రీకరా ! వరద ! లోకైకనాథ !
భక్తుని కాంక్షలు భావమం దెఱుఁగవే
నిఖిలజ్ఞుఁడవు నీవు నీరజాక్ష !
వయసుకాలము వెళ్ళె ; వచ్చుకాలమునందు
దేహపుష్టి నొసంగి తెలివి యిచ్చి
ఆరోగ్యమిచ్చి, సత్యబలంబు, నిశ్చల
ధ్యాన యోగ జ్ఞాన తత్త్వ మిచ్చి

తే॥ రక్తి నిన్నుభజించెడి భక్తియిచ్చి
భక్తికిఁ సేవ జతగూర్చి పంకజాక్ష !
రక్షణము సేయుమయ్య ! ప్రహ్లాదవరద ! భ॥ 188

సీ. ముసలి తనంబున, బుద్ధి జాడ్యంబేమి
కలుగంగఁ జేయకు కమలనయన!
చిత్త విభ్రాంతులఁ జేరగానీయకు
చింతల ముసుపకు చిద్విలాస!
తల్లి దండ్రుల సేవ తనయుల కొసంగుము
తనయుల సేవఁగైకొనెడు బుద్ధి
తలి దండ్రులకు నిమ్ము; ధరఁజీ 'జాతస్య, మ
రణము ధ్రువమ్మ'ని వినగఁ జేసె?
గీ. అయిన, సహజ మరణమనాయాసముగను
నెల్ల వాంఛింతు; రోగముల్ గల్గనీక
నీదు చింతన లొసంగి, మన్నింపు దేవ! భ॥ 189

సీ. అంగాంగములు, వణకాడఁ బాడఁగా
లేని జీవితము నే బూనలేను
మాటలు వడబడ మతిలేని యాయువు
వాంఛింప నెప్పుడీ వసుధయందు
కనులు గానఁగలేని, వినఁగ వీనులులేను
రోతజీవిత మిస్సిరో! వలవదు
ఒరులపై యాధారముండు, జీవనమాత్ర
దుస్సహమది వద్దు తోయజాక్ష!
గీ. పాటుబడి, జీవనము సల్పు బల్మి కల్మి
యాయు వున్నన్నినాళ్లు నాకమరనిచ్చి
నీ పరమ చింత నాకిమ్ము; నిర్మలాత్మ! భ॥ 190

కవితలంగూర్పగాం గావ్యముల్ రచియింప
 మనసు పరువులెత్తు ; మాధవా ! ము
కుంద ! నీ దయలేక నందంబుగా వ్రాయు
 శక్తి కల్గదు నాకు చారునేత్ర !
నీ వెట్లు నడపిన నేనట్లు నడచెద
 సూత్రధారుండ వీవు చిత్రమైన
బొమ్మగా నేనుందుం బొమ్మల వాండెట్లు
 లాడించు నా బొమ్మ లాడునట్లె
కల్లగాదిద్ది, కంసారి ! ఖలవిదారి !
ఎవ్వరేమనుకొన్న నాకేమి భయము ?
నీదు దయమాత్ర మొక్కంత నిలుపుమయ్య ! భ॥ 191

అష్ట దిగ్గజముల నండంజేర్చెను, కృష్ణ
 దేవరాయలు ; కవితా వినోద
ముల నెఱపించె ; ముద్దులు మూటగట్టు, కా
 వ్యముల, లిఖింపించె ; నల్లసాని
పెద్దన్న నల్లారు ముద్దుగాం బల్లకీ
 యందుంచి మోసె ; నెయ్యంబు దీపి
వర్ణింపం దరమె ? యా పండిత కవులెల్ల
 నేడు గలారె ? వెన్నెలలు జివురి
వారు వ్రాసిన కావ్య ప్రబంధ తతులు
వెల్లి విఱియునె ? సత్కీర్తులల్లు కొనవె ?
అట్టి యానంద జీవిత మమరనిమ్మ ! భ॥ 192

## ఉపసంహారము

సీ॥ వేద విజ్ఞానంబు వెలసె నేభువిలోన
సన్మునీంద్రుల యొక్క జన్మమెచట?
సంస్కృత సాహిత్య సంపదెచ్చట బుట్టె?
బుద్ధదేవుని పుణ్య భూమి యేది?
శ్రీరామ కృష్ణులు జెలంగిన స్థలమెద్ది?
అల పతివ్రతలకు నెలవదెద్ది?
ఖ్యాతి నార్జించిన, 'గీత' యెచ్చట పుట్టె
శాస్త్ర, పురాణ మెచ్చట జనించె?
గీ॥ మేటి వాహిని 'గంగ' జన్మించె నెచట?
సన్నిటికి నాలవాలమై యలరు, భరత
భూమి, పుణ్యంపు ధాత్రిని బొగడవశమె? భ॥ 193

సీ॥ నీతి జీవనమార్గ నియమ బోధనలెల్ల
శాసించెను - అశోకచక్రవర్తి
సంగీత సాహిత్య సంపదల, సముద్ర
గుప్తుండు పోషించె గుతుకమలర
విక్రమాదిత్యుండు వెలసి, విఖ్యాతులౌ
కవి పండితులనెల్ల గారవించె
విద్వాంసుండై, హర్ష విభుండాధ్యాత్మిక
విషయాను రక్తుండై వెలసినాడు
గీ॥ ఓ! దయామయ! నీ దయ యొప్పియున్న
కతన భారతదేశ విఖ్యాతి ప్రబలె;
క్రీస్తు శకమాది యందె ప్రశస్త చరిత! భ॥ 194

దైవభక్తుండు, దాదాభాయి నౌరోజి
బాలగంగాధర ప్రముఖ వరుఁడు
చిత్తరంజనదాసు - శ్రీ లజపతిరాయి
వల్లభాయి, విఠలుభాయి ప్రముఖు
లాలి సోదరులు, మహాత్ముండును, సుభాష
చంద్రుఁడు, మౌలాన, జవహరుండు
విజయలక్ష్మి, వినోబ, వీర రాధాకృష్ణ
పండిట్జి, రాజాజి పండితుండు

వీరలందఱు జన్మించి భారతాంబ
గర్భవాసాశిలోఁ దల్లి కష్టములను
బాపుకొల్లను నీ దయ వల్లకాదె ? భ॥ 195

శ్రీ సాంబమూర్తి, కాశీనాథ నాగేశ్వ
రుఁడు, వేంకటప్పయ్య, రూఢిగాగ
గోపాల కృష్ణుండు, గోపాలరెడ్డి, క
ళావేంకట సుపుత్ర లలితయశుఁడు
పొట్టిశ్రీరాములు, పట్టాభి సీతయ్య
కాళేశ్వరాయుండు ఘనుఁడు, మఱియు
అల్లూరు - ఇల్లూరు - కల్లూరి వారు, వి
ఖ్యాత యశోబలుల్గల్గినారు

భారతాంబకుఁ దమతల్లి బంధనముల
విప్పినారు, మహాత్మ వివేకగరిమ
దీనికెల్ల మూలము నీవె ; దేవ దేవ ! భ॥ 196

సీ॥ భారతలక్ష్మి, సౌభాగ్యవృద్ధియై, పాడిపం
టల, లోపములు లేక వెలయవలయు
భారతీయుల, సహకార భావము పట్టు
దలయును, వృద్ధియై దనరవలయు
పంచశీలంబుల - పరమతత్త్వ మితర
దేశస్థులందఱు దెలియవలయు
సాహసమందు విశ్వాసంబు వెలయించి
కార్యముల్ దీర్పగా గడగవలయు
గీ॥ హిందు ముస్లిము సోదరులందు, సమత
భావ మల్లారుముద్దుగా జరగవలయు
దేవ ! ఈ కార్యముల నెల్ల దీర్పుమీవె ! భ॥ 197

సీ॥ స్వాతంత్ర్య మొందిన భారతలక్ష్మికి
మహిమోన్నతంబైన మంగళములు
రాజేంద్ర బాబుకు రమణీయ మూర్తికి
రంగారు జయజయ మంగళములు
సాహసోపేతుడౌ - జవహరులాలుకు
బంగారు శుభకర మంగళములు
సంక్షేమ సౌభాగ్య సామ్రాజ్య సిద్ధికి
మర్యాద లొనగూర్చు మంగళములు
గీ॥ మహిత కాంగెస్సు సంస్థకు మంగళములు
భారతక్షేమ మెప్పుడు భావమందు
మనసు మొనరించు వారికి మంగళములు ; భ॥ 198

సీ॥ తల్లి - అశ్వత్థమ్మ - తండ్రి - గూళూరు, కృ
ష్ణార్య విప్రుండు - మతాభిమాని
కాశ్యప గోత్రుఁ డక్కమలాక్షు శ్రద్ధతోఁ
బూజించు భక్తుండు ; పుణ్యయశుఁడ
తని, జ్యేష్ఠ పుత్రుండ, నను - అహోబలరావు
పేరుతోఁ బిలుచుచున్నారు ; నేను
లక్షణగ్రంథ సారంబెఱుంగఁ ; గవిత్వ
ధార, నీదయగాదె ? శ్రీ రమేశ !

గీ॥ రక్తి, మందార పూమాల భక్తిఁ గుచ్చి
యర్పణము జేసినాఁడ ; జోహారు దేవ !
కాన్కఁగైకొని దీవింపు - కరుణతోడ ! భ॥ 199

సీ॥ ‘ భక్తమందారంబు ’ - పాపసంహారణంబు
పాలుపారఁ జదువుఁడీ పురుషులార !
‘ భక్తమందారంబు ’ - పాడుఁడీ భక్తితో
లేమి, తొలఁగుచుండు భామలార !
‘ భక్తమందారంబు ’ - భక్తితో నేర్వుఁడీ
బాల బాలికలార ! భయము దొలఁగు
‘ భక్తమందారంబు ’ పాడి విన్పించిన
ఆనంద సౌఖ్యంబు లందు చుండు

గీ॥ ప్రతిదినము భక్తిఁ జపియింప పరమసిద్ధి
పదము జేకూరు ; శ్రీనాథ ! భయవిదూర !
అతి దయానంద ! గోవింద ! హరి ! ముకుంద ! భ॥ 200

॥ ఓం శాంతిశ్శాంతిః ॥

# గ్రంథకర్తలకు సూచనలు

1. గ్రంథకర్తలు సాధ్యమైనంతవరకు వ్రాయులసీను వారుగ నుంచవలయును. గ్రంథమాల నియమములకు లోబడి క్రౌనుసైజు 100 పేజిల లోపలనే యిముడునట్లు పుస్తకము లుండవలెను. శుద్ధప్రతి వ్రాసి పంపవలెను.

2. గ్రంథమాల ప్రవృత్తస్థితిలో గ్రంథకర్తలనేరీతిగను బహూకరింపనేరదు. ఉచితముగనే గ్రంథము లిచ్చుచుండ వలయును.

3. పుస్తకములందుగాని, పుస్తక భాగములందుగాని, వలయు మార్పు లొనరించుటకు మేనేజరుగు ఎడిటరుగారికి సర్వాధికారము లుండును.

4. ప్రథమ ముద్రణముయొక్క ప్రతులపై గ్రంథకర్తల కేలాటి హక్కులులేవు. గ్రంథమాలకు రెండవ ముద్రణము మరల సంవత్సరముననో, అంతకుముందో కావలసి యున్న యెడల గ్రంథకర్తలయొక్క ఆక్షేపణ యుండకూడదు. రెండవ సంవత్సరము ముగిసిన తర్వాత గ్రంథములపై గ్రంథమాల కెట్టి అధికారమును లేదు.

5. ముద్రణమైన వెంటనే 50 ప్రతులు మాత్రము గ్రంథకర్త యుపయోగమునకుఁ బంపబడును. ఈ పుస్తకముల నతఁడమ్ముకొనరాదు. గ్రంథకర్తలు, గ్రంథమాలాభివృద్ధిని కోరి, చందాదారులాది పోషకులను చేర్పించి సహాయ పడవలయునని విజ్ఞప్తము.

6. గ్రంథమాల ప్రశ్నములను, గ్రంథకర్తయొక్కయు సంపాదకులయొక్కయు అనుమతిలేక యెవ్వరుగాని, యేభాషలో గాని భాషాంతరీకరణము చేయకూడదు, ముద్రింపకూడదు. అనుమతి పొందక నాటకములను కూడా ప్రదర్శింపకూడదు.

7. కార్యనిర్వాహక సభ్యులలో మెజారిటీ సభ్యులు ప్రకటించుట యోగ్యమని, ముద్రింపబడు గ్రంథముపై లేక గ్రంథ భాగము లేదా రచనపై, తమ యభిప్రాయ మొసంగవలయును. అన్న అయ్యది ముద్రింపబడదు.

8. పై నిబంధనలందు మార్పులొనర్చుటకును, క్రొత్తగాం ర్పాటుకును, రద్దు జేయుటకును, గ్రంథమాలాధ్యక్షులకు, సంపాదకులకు, కార్యనిర్వాహక సభ్యులకును సంపూర్ణాధికార ముండును.

ఇట్లు,
సంపాదకుడు.

గ్రంథమాలా ఆనరరీ సభ్యులు

ఈ క్రిందివారు గ్రంథమాల యందాసక్తి వహించి దాని ప్రకోభివృద్ధిని కాంక్షించి చందాదారులు, అభిమానులాదిగాగల వారిని చేర్పించి, గ్రంథమాలకు సహాయము చేయుచున్నారు, వారికి కృతజ్ఞులము. చందాదారులు అభిమానులాదిగాగల వారందఱును, ఈ క్రిందివారికి, తమ చందా, విరాళ మొత్తములను చెల్లించి, వారివలన అప్పుడప్పుడు రశీదులను, తమకు రావలసిన పుస్తకములను పొందవలయును.

1. శ్రీ విద్వాన్ గొల్లా పిన్నిరామదేవశాస్త్రిగారు, తెలుగు పండితులు, బోర్డు హైస్కూలు, పెనుకొండ.

2. శ్రీ అప్పూరి నారాయణగారు, తెలుగు పండితులు, బోర్డు హైస్కూలు, పుట్లూరు (తాడిపత్రి తా.)

3. శ్రీ యం. కృష్ణమరాజుగారు, తెలుగుపండితులు, బోర్డు హైస్కూలు బుక్కరాయసముద్రం (అనంతపురం)

4. శ్రీ యన్. వెంకటరామయ్యగారు, అసిస్టెంటు టీచరు, బోర్డు హైస్కూలు, పామిడి (అనంతపురం)

5. కరణం సుబ్బారావుగారు, పెద్దవడుగూరు, (గుత్తి తా.)

6. శ్రీ విద్వాన్ ఘూళి కృష్ణమూర్త్యాచార్యులుగారు, తెలుగు పండితులు, మునిసిపల్ హైస్కూలు, బళ్ళారి

7. విద్వాన్ వెల్లాల శ్రీనివాసమూర్తిగారు, తెలుగు పండితులు బోర్డు హైస్కూలు, కల్యాణదుర్గము

8. కె. జానకీరామరావు, 11/88 తిలక్‌రోడ్డు, అనంతపురము

9. శ్రీ నోంపల్లి కృష్ణమూర్తిగారు, తెలుగు పండితులు, కదిరి.

10. శ్రీ తుంపర్తి పుల్లయ్యగారు, రిటైర్డు టీచరు, ధర్మవరము

11. శ్రీ కె. నీలకంఠరావు, హైస్కూలు టీచరు, మడకశిర

బళ్ళారి, కర్నూలు, కడప, చిత్తూరు జిల్లాలయందును ఆంధ్రరాష్ట్ర ముఖ్యపట్టణములయందును కమీషన్ పద్ధతిగా పని చేయువారికి 25% కమీషన్ ఇవ్వబడును.

వివరములకు :— మేనేజింగు ఎడిటరు,
శ్రీ కృష్ణదేవరాయ గ్రంథమాల,
12/433 నింకంపల్లిరోడ్డు, హిందూపురము
(అనంతపురం జిల్లా) అని వ్రాయవలెను.

శ్రీ విష్ణు ప్రింటర్సు, హిందూపురం.